

అంకురార్పణము

చిత్రకారుడు: ఖగేంద్రరాయ్.

సంతానముకొఱకై ప్రతినిముషము నువ్విళ్లూరుచు ఉప
వాసములు వ్రతములుచేసి పవిత్రమగు మాతృత్వమును
వహించెదు—

మాతా! నీ యాశయములు దివ్యములు!

అనుక్షణమును అభివృద్ధిని కాంక్షించి ఆహారపానీయముల
నిచ్చి కంట వత్తిడుకొని కాపెట్టి పెంచి పెద్దజేసెదు—

తల్లీ! నీ త్యాగ మమోఘము!!

భావిజీవితమున ప్రభవాన్వితులై మనుటకు సర్వవిధముల
నాదర్శప్రాయవై నోటితోనుడువక చేతితోచేసి
చూపెదు—

మాతృమూర్తీ! నీ మహిమ యనంతము!!!




# గృహపరిశ్రమలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు గత సంచికయందు శారదలేఖలో "సోదరీమణులలో నెవరే గృహపరిశ్రమల నెఱిగియున్నను నద్దానిని దాపఱికములేక గృహలక్ష్మి యందు ప్రకటించునట్లు గృహలక్ష్మి కృషి చేయవలయును. మఱియు గృహపరిశ్రమల కుపకరించు చిన్నచిన్న యంత్రములేమైన యున్నచో వాని వివరములు అవిదొరుకు స్థలములు గృహలక్ష్మిలో ప్రకటింపవలయును. గృహపరిశ్రమల విషయమై యొక వ్యాసమును రచించిన యొక స్త్రీకంటె నొక పరిశ్రమ నాచరణయందుంచు స్త్రీకి బహుమానమొసంగునట్లు ప్రకటింపవలయు" ననుచు గృహపరిశ్రమలనుగూర్చి వ్రాయుటలో చేసిన సూచన పాఠకులందరెఱిగియే యుందురు. మఱియు వీరన్నటుల 'స్త్రీల యారోగ్యసౌభాగ్యముల పెంపొందింప నుదయించిన గృహలక్ష్మి స్త్రీల యార్థిక సౌభాగ్యమునకు కూడ' దోడ్పడదలంచి యాదినుండియు వలయు ప్రయత్నములు చేయుచునేయున్నది. కాని తన యాశయములందు సంపూర్ణమగు విజయమును బొందజాలక పోయినది. దీనికి కారణము ఆంధ్ర నారీమణుల యుదాసీనతయు, నుత్సాహహీనతయు సహకారతలేమియునై యున్నవని వ్రాయవలసి వచ్చినందుల కెంతయో విచారమగుచున్నది. ఎవ రే కార్యముచేయ బూనుకొన్నను పట్టుదలయు నుత్సాహమును సహకారతయు లేకుండిన నదియభివృద్ధికి రాజాల కారంభమునందే యంతరించుటకు హేతువగును. స్త్రీల నన్నివిధముల నభివృద్ధికితీసికొనివచ్చు తలంపుతో నాంధ్ర

సోదరీమణుల సహకారమును గోరి పెక్కుమారులు పెక్కు విషయములనుగూర్చి ప్రకటించియుంటిమి. కొన్నింటి విషయములలో కొందరారంభమున మాత్రముత్సాహము జూపిరి. సశక్తియుతులయ్యు నితరులుమిన్నకుండిరి. అందుచే కొంతవఱకు మా ప్రయత్నములు మానుకొనవలసివచ్చినది. అట్లు చేయుటకు మాకిష్టములేనందున యభివృద్ధి విషయములగూర్చి పలుమరు ప్రకటించుచునేయున్నారము. కాని యెప్పటి యట్ల యాంధ్రనారీలోకముత్సాహము జూపెట్టుట లేదు; సహకారము ప్రదర్శించుట లేదు. వారు తమ కవిచ్ఛిన్న కార్యోత్సాహము సహకారము కొరవడుట లేదని ప్రదర్శింపబూనుకొనువఱకును పై సూచనల గృహలక్ష్మి యాచరణలో బెట్టుటకు సాధ్యముగాదు.

ఐదారు మాసములనుండియు, గృహపరిశ్రమలవిషయమై గృహలక్ష్మియందు మేము గావించిన ప్రకటనలును, దానికి వచ్చిన సమాధానములును దీనికొక నిదర్శనము.

దేశము పరాక్రాంతమై సంపదంతయు విదేశములపాలై పరిశ్రమలు మంటగలసి నతి దీనస్థితికి వచ్చియున్న నేడు గృహోద్ధరణమునకు—గృహోద్ధరణమే దేశోద్ధరణము—మూలకారకులైన స్త్రీలు, పూర్వమునందు వలెనే తమకు ముఖ్యముగ గావలసియుండు వస్తువుల నితరులపై నాధారపడక గృహపరిశ్రమల మూలమున సమకూర్చుకొన్న యభివృద్ధికదియు నొకమార్గమగునను నుద్దేశముతో గృహలక్ష్మియందు గృహపరిశ్రమలచే డబ్బు గడించుటెట్లను విషయమును కొన్ని మాసములుగా ప్రకటించుచుంటిమి. ఆపరిశ్రమ లిట్లుండవలయునని మేము గావించిన నిబంధనలే మాయభిప్రాయముల తేటపఱచుచున్నవి.

గృహిణు లిలువీడకనే స్వయంసహాయముచేతనే చేసికొనదగిన పరిశ్రమలై యుండవలయును ననుటిందులో మొదటిది. అనగా ప్రతిసంసారమునందును స్త్రీలు ఇలు వీడకుండు నవసరముండవచ్చును. దీనికై బయటికిపోవుటకు ప్రయత్నించిన యితర పనుల కభ్యంతరములు గలుగవచ్చును. అదియును సాధారణ గృహిణి తనకుదానే యాపరిశ్రమ నిర్వహించుట వీలుగనుండవలయును. అటుల జేసికొనుటలో విదేశ వస్తువులేమియు నందు జేరకూడదు. మన దేశమునందు ప్రతిపరిశ్రమయు విదేశవస్తువులను సాధ్యమైనంతవఱకు వాడకుండుటకు ప్రయత్నించినగాని లాభముండదు. అంతియ కాక పరిశ్రమలచే సమకూడువస్తువులిపుడు మనదేశమునందు విరివిగ వాడబడుచున్న విదేశవస్తువుల స్థానమాక్రమించునవియై యుండవలయును. అటులని పరిశ్రమలందుపయోగించు వస్తువులెంతో కృషిచేసినగాని దొరకనివిగా నుండగూడదు. సులభముగా లభింపని వస్తువులతో స్త్రీలు పరిశ్రమలను కొనసాగింపజాలరు. ఈసర్వసామాన్యముగా లభించువస్తువులచే నిర్వహింపబడు పరిశ్రమ లితరుల జీవనాధారముల కడ్డు తగులగూడదు. ఈ పరిశ్రమవలన లభించు

వస్తువు లందరికి నత్యంతావశ్యకముగనుండి త్వరగా కర్చగునవిగా నుండవలయును. అందువలన పరిశ్రమనిరంతరాయముగా కొనసాగుటకు వీలగును.

ఈ యుద్దేశములనే నిబంధనలుగా గృహలక్ష్మియందు జూచుచున్న పాఠక సోదరీమణులిందలి ప్రాముఖ్యమును గమనించి తగిన పరిశ్రమల యోచించి వివరములతో తమతోడి సోదరు లెఱుగవలసిన సలహాలతో వ్రాయరైరి. వ్రాసిన వారిలో చాలమంది నూలువడుకుటకును గూర్చి మాత్రము వ్రాసిరి. అది గృహిణుల కర్మకలాపములో జేర్చవలసినముఖ్యాంశమయ్యు పైన పొందు పరుపబడిన యుద్దేశ్యముల నెరవేర్పజాలదు. తదితరులు వ్రాసిన పరిశ్రమలు చేయుటకు సులభమయ్యు నంత ముఖ్యమైనవిగ గన్పట్టవు. ఇందులో నొక ముఖ్యాంశమేమనగా వివిధ పరిశ్రమలను అందలి సాధకబాధకములను గుర్తెఱిగిన వారొక్కరైన ముఖ్యముగ చేయవలసిన పరిశ్రమల విషయమై వ్రాయరైరి. అట్టి యాంధ్రనారీమణులు లేరనుటకు సాహసింప జాలము కాని వారికా విషయములు వ్రాయుటకుగాని సలహాల నిచ్చుటకుగాని తగుశ్రద్ధ లేకున్నదేమోయని గట్టిగ సందేహింప వీలుగలుగుచున్నది. ఇకనైన సోదరీమణు లీ ముఖ్యాంశముల గమనించి యిట్టి పరిశ్రమలగూర్చి వ్రాయుదురను నాశయముతో నిపుడొక్కటిని గూర్చి వ్రాయుచున్నాము.

గృహపరిశ్రమలవలన సాధ్యమై నన్ని వస్తువులను జేసికొనసాధ్యమై యున్నను నేవియెక్కు డావశ్యకములో సులభము లెవ్వియో, వానినిగూర్చి ముందుగా ప్రయత్నించు టుత్తమము.

గృహపరిశ్రమలన్నంత మాత్రమునవిరామకాలమునందు చేయనగువస్తువులను పనులనుగూర్చి యాలోచించెదరు. పరిశ్రమలు విరామ కాలముననే జేయదగియున్నను, తాము దినమునకు రెండుమారులు సిద్ధము చేయవలసిన యాహారపదార్థములందు ముఖ్యముగ నుపయోగపడునట్టియును నతి సులభముగ లభించునదియును అగు ఉప్పువంటి వస్తువులయెడ వారిదృష్టి పారుట లేదు.

నిరంతర మాహారపదార్థములను సిద్ధపరచుటకు పెక్కువస్తువుల గొనవలసివచ్చుచుండును. వానిలో బియ్యము, పప్పుదినుసులు, తుదకు కూరగాయలుకూడ మంచివా కావా యనియు, నితరవస్తువులతో చేరక నిర్మలముగానున్నవాయనియు నెంతయో శ్రద్ధతో పరీక్షించిగాని కొనరు; ఉపయోగింపరు. కాని ఉప్పు విషయమున మాత్రమిదేమియులేదు. పైగా చౌకగ దొరుకు ఉప్పునే వాడుటకు ప్రయత్నింతురు. ఉప్పు సర్వసాధారణముగా నతి చౌకగా లభించు వస్తువులందొక్కటియయ్యు నితరవస్తువులకంటె విరివిగ వాడదగు పదార్థమని యందఱెఱిగినదే.

ఇంత సామాన్యముగ వాడు పదార్థము శుభ్రమైనదా కాదాయను యోచన యెవ్వరును చేయమి విచారనీయము. మనదేశమున చేయు నుప్పు సముద్రజలమును భూమి పైకి పారించి సూర్యరస్మికి ఎండించి చేయుదురనియు, భూమిపైనిల్చిన యుప్పునందు రాళ్లును మట్టియును కలసియుండుననియు గమనింపవలెను. కావుననే ఉప్పు మలినముగా గనబడుట. దీనికితోడు వ్యాపారమునందు లాభముగడించు నుద్దేశముతో కొందరు ఉప్పురంగుగల రాళ్లనుకూడ కలుపుచున్నారు. దీనిఁగొని స్త్రీలా విధముగనే వంటల కుపయోగించెదరు. అందువలన మనకు దెలియకనే మన యాహారపదార్థములమూలమున మట్టియు రాళ్లును మన శరీరమునందు ప్రవేశించుచున్నవి. వీనిచే అజీర్ణసంబంధమగు రోగములును మూత్రరోగములును గలిగి యారోగ్యము చెడుచున్నది. పండ్లు కూడ యొక్కప్పుడు చెడిపోవుచున్నవి. శరీరము నందంతయు గనులుపెట్టుకొని ప్రతిపదార్థమును శుభ్రపరచితిమను నమ్మకముతో నుండువారే ఉప్పు రాళ్లతోను మట్టితోడను నిండియున్నదని యెఱుగక నటులనే యుపయోగించుట వలన రాళ్లురప్ప లుండవని యెంతో ఆనందముతో భుజింప బూనుకొనువారి నోటి యందు దాకస్మికముగ కనిపించి పళ్లను పటపట లాడించి తాము కొన్నితిట్లనుదిని వండిన వారికి కొన్నితిట్లను వడ్డింపించి రసాభాసము చేయురాళ్లు మరి యే యితరపదార్థముల నుండియైన వచ్చుచున్నవా? కొద్దిగనో గొప్పగనో ప్రతివార లీ యనుభవముల బొందినవారే! చీదరించుకొనువారే! కాని ప్రతిక్రియమాత్రము దలపెట్టుట కోపికగాని శ్రద్ధగాని జూపరు. కొందరుమాత్రము యీ బాధనుండి తప్పించుకొనుటకై యింగ్లండు నం దతినిర్మలముగ తయారుచేసిన టేబిల్ సాల్టు (Table Salt) అని యమ్మబడుచున్న ఉప్పును వాడుట కారంభించిరి. ఇది సాధారణపు టుప్పునుండి జేయనగును. విదేశమునుండి దిగుమతికాబడిన యీ యుప్పును 1 పౌను (40 తులములు) అణా మూడుకానులు, రెండణాలవంతున నమ్ముచున్నారు. అదేఉప్పు మనదేశమున రెండు కానులుకూడ కాదేమో? ఇంతచౌకగ మనకిది దొరుకుచున్నను పైకారణమువలన మన ధనమంతయు విదేశములకు బోవుటో లేక అనారోగ్యము గలుగుటో యగుచున్నది.

స్వదేశాభిమాను లీ విదేశపు టుప్పును బహిష్కరింపవచ్చునుగాని యొకమారలవాటుపడినవారు సులభమునా వాడుకను త్యజింప కష్టముగ గన్పడవచ్చును. ఈకష్టము కూడ లేక మన కతిసులభముగ చౌకగ లభించుఉప్పునే పాశ్చాత్యులవలె శుభ్రపరచుకొని యుపయోగించవీలులేదా!

ఉప్పును నిర్మలముగా చేయు పద్ధతుల నిదివఱకే గృహలక్ష్మి ప్రకటించియున్నది. ఆవిధముగానైనను, తమకు దెలిసిన మరేవిధముగానైనను సాధారణపు టుప్పును టేబిల్ సాల్టువలె నిర్మలముగా చూచుటకు మనోజ్ఞ

ముగాచేసి యీ వివరములన్నియు మాకు వ్రాసినచో వానిని ప్రకటించుటయేగాక తగిన సహాకారము యివ్వగలము. ప్రతిపాఠక సోదరీమణియు నీకార్య మింతసులభమైన శ్రమ యని యెంచక, ఒకరూపాయకు బజారులో దొరకు నుప్పునుగొని దానిని పైజెప్పినరీతి నిర్మలముచేసి, చేసినపద్ధతియు, దానికైన యితరవ్యయము, నిర్మలమైనయుప్పు యెంత మిగిలినదియు, దానిని నష్టము రాకుండ పోను ఎంత కమ్మదగియుండునదియు, మొదలైన వివరములన్నియు వ్రాయగోరుచున్నాము. వీనితోగూడ తాముచేసిన ఉప్పుకొకపౌనును అన్‌రిజిస్టరు పార్సెలుద్వారా మా కార్యాలయమునకు పంపవలయును. ఈవిధముగ పంపబడిన వానిలో శ్రేష్ఠముగ చేయుపద్ధతి ప్రకటింపబడును.

ఈ రీతి నుప్పునుచేసి వారు తమ తమగ్రామములందే నమ్ముకొనగును. వారటులచేయుటయు సాధ్యముగానిచో లేక అదియంతయు నచట కర్చుకానిచో వారు దానిని మా కార్యాలయమునకు బంపుకొనవచ్చును. మే మిచట గృహలక్ష్మి భాండాగారమనియో లేక సోదరీమణులందరంగీకరించు మరొక్కపేరుననో యొక భాండాగారము (Stores) నేర్పరచి చెన్నపురియందే యమ్ముటకు సౌకర్యముగలిగించి వారిపైకమును పంపుప్రయత్నముల గావింతుము. ఈయుప్పునుగూర్చి మాప్రతికయం దుచితముగా ప్రకటన యేర్పాట్లుకూడ చేయగలము.

దీనినిగూర్చి ప్రతిసోదరియు శ్రద్ధవహించునని మానమ్మకము. ఈవిధముగ నాహార పదార్థములందే ముఖ్యముగ గమనింపదగినవి పెక్కుగలవు. వానినెల్ల యాలోచించి యుప్పువలె విదేశవస్తువుల స్థానమాక్రమించు వస్తువులుగాచేయుపద్ధతులను సలహాలను ఆహ్వానించుచున్నాము. వారందరికి కూడ పైకనుపరచిన సాయముచేయగలము.

అదియును గాక గృహపరిశ్రమలవలన చేయనగువస్తువులను వారే యమ్ముకొనుటకేవిధముగానైన నశక్తులైనపుడును, చేయుటకే యితరసహాయము గావలసివచ్చినపుడును తోడ్పడుటకు మా కార్యాలయము కేంద్రస్థానముగానుంచి యొక సంఘమును (Limited Concern) స్థాపింపదలంచుకొని యున్నాము. దానికి గృహలక్ష్మిచందాదారులైన స్త్రీలందరును భాగస్వాములుగా నుండి రూపాయవాటాల నేర్పరచి వసూలైన మొత్తముతో గృహపరిశ్రమలు చేయువారికి తోడ్పడునగునని యూహించుచున్నాము. దీనినంతయు స్త్రీలే నిర్వహింపనగును. ఈ విషయముపై సోదరీమణులు తమయభిప్రాయముల నిత్తురని ప్రార్థించుచున్నాము.

---

'నిరుద్యోగులైన స్త్రీలు'—సంపాదకీయవ్యాసమును చూడుడు.

---

# సహధర్మిణి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

సీతాదేవి యంతఃపురము

(సీతాదేవి భర్తయగు శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకు సర్వసిద్ధమై యుల్లాసముతో నెదురుచూచుండ శ్రీరాముఁడు విచారముతో ప్రవేశించును.)

సీ:—(రామున కెదురుబోయి) ఆర్యపుత్రులకు నేడు పట్టాభిషేక శుభదినము గదా. శ్వేతఛత్రాది రాజలాంఛనములతో భద్రగజాధిరూఢులై రాక విన్నబోయిన వదనముతో నిటు కాలినడకను విచ్చేయుచున్నా రేమికారణము?

రా:—దేవీ! పట్టాభిషేక కార్యక్రమ మాగిపోయినది.

సీ:—ఏల?

రా:— మున్నొకప్పుడు దేవాసురులకు సంగ్రామము ప్రవర్ధిల్లినతఱి మాతండ్రిగారు దేవేంద్రునిచే ప్రార్థితులై వారికి సహాయంబుగా యుద్ధంబు జేయ వెడలిరి. తత్సమయంబున నొకానొక నిశీథమున శతమాయుండగు తిమిధ్వజాసురుఁడు దేవతలపైఁబడి పోరాడదొడంగెను. మాతండ్రిగా రవ్వార్తవిని యతిసాహసంబుతో వానినెదుర్కొని కడుదూరము పోరాడి తుదకు క్షతగాత్రులై రథంబుపై నొరగిరి. అత్తఱి మా తండ్రికి రథంబు నడపుచున్న మాతల్లియగు కైకేయీదేవి యత్యంతనైపుణ్యముతో సంగ్రామరంగంబునుండి యరదంబు తోలంగద్రోలి మా జనకులు రక్షఃస్సంఘము బారి బడకుండ కాపాడెను. అందులకు మాతండ్రిగా రానందించి యామెయెడ ప్రసన్నులై రెండు వరములొసంగిరి.

సీ:—రఘుకులతిలకులకు ధర్మోదార్యములు రెండును పెట్టని సొమ్ములుగదా.

రా:—ఆ వరముల నామె యప్పుడే కోరక అవసరము గలిగినప్పుడు వినియోగించుకొందుననెను. ఆ వరముల నేఁ డడిగిరి. అందొకవరము నేను పదునాలుగేండ్లు కాననవాసము సేయుట, రెండవవరము తమ్ముఁడగు భరతుఁడు నాకు మారుగా యౌవరాజ్యాభిషిక్తుఁడగుట.

సీ:—ఎంత దారుణములగు కోరికలు! అనుచితములగు నీ వరంబులొసంగుటకు మామగా రంగీకరించిరా?

రా:—ఇనవంశదీపకులగు మాతండ్రిగారికి సత్యవాక్యపరిపాలనమును నాకు పితృవాక్యపరిపాలనమును, అవశ్యకర్తవ్యములు.

సీ:—మఱి నాకర్తవ్యము?

రా:-నీవు మా జననీజనకుల సన్నిధిని నిందేయుండి వారు నా వియోగఖిన్నులు గాకుండ సేవింపవలయును. మఱియు ప్రభుం డగు భరతునియెడ విమనస్కవై యాతని నెగ్గులాడక విధేయతతో వర్తింపవలయును. కైకేయాది మా మాతృసంఘము నెడల గూడ భక్తిగౌరవములు గలిగి వర్తింప వలయును.

సీ:-నాథా! ఇవియేటి హితబోధలు! సాధ్వియగు స్త్రీకి భర్త్రానుగమనంబు పరమ ధర్మంబుగదా.

రా:-ప్రియా వరదత్తమగు వనవాసవిధి నాకుమాత్రమే. భార్య భర్తయొక్క యర్థాంగి. అర్థభాగమగు భర్తను నడవి కేగుమనినచో శేషించిన యర్థభాగమగు భార్యనుగూడ పొమ్మనినటులేగదా. ఇందు లకు ప్రత్యేక శాసనమెందులకు? వెలుగుతో నీడయు చంద్రునితో వెన్నెలయు, నిర్గమిం చుట సహజమే గదా.

రా:-కాంతా! కాంతారవాసమత్యంత కష్టభాజనము. శిరీషకుసుమకోమలులగు స్త్రీజనంబులు వనవాసక్లేశముల భరియింప జాలరు.

సీ:_ఆర్యపుత్రా! కౌసల్యాదేవి గారాబు తనయులగు తాము భరియింపజాలిన కష్ట ముల నేను భరియింపనోపనా? నాథా! మీరులేని యయోధ్య నాకడవి. మీతో గూడియున్నయడవి నాకయోధ్య. మీరు లేక రాజోపభోగములతో నలరారునీయంతః పురావాస మొక్కక్షణమైనను నంగీకరింప జాలను, దయయుంచి తమవెనువెంట విచ్చే యుట కనుజ్ఞ దయసేయుడు.

రా:_దేవీ! వనవాసక్లేశములు వివిధ ములు. నానావిధ సుఖభోగముల కాటపట్టు లగు రాజాంతఃపురములవసించు నీవు వానిని యూహింపజాలవు. వనవాసమనిన నేమిగా తలంచుచుంటివి? శిలాకంటక పరీతములగు దుర్గమపథములలో నడువవలయును. భయం కరమృగవ్యాళములమధ్య వసింపవలయును, కఠిన శిలాతలంబులపై పరుండవలయును, నారచీరలగట్టవలయు కాయగసురుల మెసవ వలయును. అవియు దొరకనిచో నుప వాసమే చేయవలయును. ప్రియా! యిట్టి దుర్భరకష్టముల నీవు సైరింపజాలవు, కాన నీవిచటనేయుండి మా తలిదండ్రులప్రాపున సుఖంబుగ ప్రొద్దులుపుచ్చుము.

సీ:-నాథా! పతిప్రాణనగు నాకు మీ వియోగమేకష్టము గాని కాననవాసము కష్ట ముగాదు. వనవాసక్లేశములు మీకు మాత్రము పరిచితములా? మీ కనుభావ్యము లైనవి నాకేల యసహ్యములగును? దేవతా నీకముతో దేవేంద్రుడెత్తివచ్చినను నిర్జింప గల తమ సాన్నిధ్యమున నా కేలాటియాప దలును ప్రాపింపవు. సతికిపతితోడిదలోకము. ఆర్యపుత్రులు నన్ననుగ్రహింపవలయును.

రా:- ప్రియా! దుర్గమపథములలో నడచునెడల నరుణములగు నీపాదపల్లవ ముల నరయజాలకయు, సూర్యాతపముచే

వాడుబాఱిన నీ ముఖారవిందమును చూడ జాలకయు నా చిత్తము నీ వనవాసనిర్గమంబున కంగీకరింపకున్నది. అలమటజెందకుము; అన్యథాభావింపకుము, అయోధ్యనుండుట కంగీకరింపుము.

సీ:—నాథా! నశ్వరమగు శరీరసుఖంబు కొఱకు అధర్మమార్గమున నెట్లు ప్రవర్తింతును? మీయెడబాటున కెట్లంగీకరింతును? ప్రాణేశ్వరా! మీతో విహరించినవనీ విహారంబులు నా కుద్యానవనవిహారంబులు. మీతో విశ్రమించిన కఱకుఱానేలలు నాకు హంసతూలికాపాన్పులు. మీరు చేఁజేత బెట్టిన కందమూల ఫలములు నాకు మధుర హారంబులు స్త్రీకి తలిదండ్రుల సేవగాని యత్తమామల సేవగాని విధాయకంబుగాదు. పతిసేవయే పరమధర్మంబు అది యట్లుండె. హృదయేశ్వరా! జలజల బాఱుసెలయేళ్లు కలకలకూయు పక్షిగణములు గమగమలాడు పుష్పప్రకరములు అహా! ఎంత నిసర్గ మనోహరమా కానన దృశ్యము. నాథా ప్రకృతిశోభ తిలకింప ననుగ్రహింపుడు.

రా:_దేవీ! నావెనువెంట విచ్చేయ నుత్కంఠచే వనవాసక్లేశముల చులకన జేయుచున్నావు కాని నిశాచరవిహార భీకరంబగు నరణ్యం బబలాజన ప్రవేశ యోగ్యంబుగాదు. దుర్మార్గులగు రాక్షసులు పెక్కుమాయలు బన్నుచుందురు. మనము దురంతకష్టముల బడవలసియుండును. కావున నామాటవిని వనవాసగమనేచ్ఛ విరమింపుము.

సీ:_దేవా? విశ్వవిఖ్యాతమగు తమ కోదండపాండిత్య మెవరెఱుంగరు? తాటకాసుర సంహారము విశ్వామిత్రయాగ సంరక్షణము శివధనుర్భంగము పరశురామ గర్వ విచ్ఛేదమాది తమ విజయగాథలన్నియు నింకను చెవులందు గింగురుమనుచున్నవి. నాథా! నేనేమి యపరాధమొనర్చితినని నాకీదారుణ వియోగశిక్ష విధించెదరు?

రా:_దేవీ యిది దైవనియోగము మన యెడబాటు తప్పదు.

సీ:_ఆర్యపుత్ర! మీమృదుల హృదయ మింత కాఠిన్యతవహించిన నాకికశరణ్యమేది? స్త్రీకి పతితోడిదలోకమను నార్యోక్తికి సార్థకతయేది? నాథా! మీరరణ్యమునకేగిన పిమ్మట చిలుకలేని పంజరమువలె నున్న యీ యంతఃపురమున నేను మనగలనా? నీరుననో, నిప్పుననో, విషంబుననో, అసువులవీడుదును. ప్రాణేశ్వరా? మీకదియే సమ్మతమా? నన్ను ఆత్మహత్య మహాపాతకమునకు గుఱిచేసెదరా? మీసేవాశుశ్రూషలచే పవిత్రనగు భాగ్యంబు గల్పింపరా? మీవియోగార్ణవమగ్ననై నేనిట ప్రాణవిముక్తను కావలసిదేనా? అయ్యో! యెంత కష్టమెంతకష్టము! పతితో కాననవాసము చేయుదువని విప్రులగు దైవజ్ఞులు మున్ను చెప్పిన మాటలుగూడ వమ్మయ్యెనే! ఏ దైవము తోడ్పజాలకపోయెనే. జీవితేశ్వరా! మనయెడబాటు నిత్యమేనా సత్యమేనా? హాఁ హాఁ హతవిధీ! (రాముని గుండియలపై తలమోపియేడ్చి పాదములపైఁబడును.)

రాః—(తటాలునవంగి) ప్రేయసీలెమ్ము. (అని రెండుచేతులతో లేవనెత్తి గ్రుచ్చి కౌగలించుకొని) ప్రియా! సుకోమలగాత్రి వగు నిన్ను కాననవాసక్లేశములకు గుఱి చేయలేకసంకోచించినందుల కెంత యలజడి చెందితివి. రమ్ము దుఃఖము మానుము. కాంతారవాసంబుకంటె నావియోగమే నీకు దుర్భరమగునేని లెమ్ము. వనవాసమునకు సిద్ధముగమ్ము. నీ ధనకనకవస్తువాహనమణి నిచయంబులెల్ల విప్రులకు,భిక్షులకు,పరిజనంబులకు లెస్సగ బంచిపెట్టుము.

సీ:—ధన్యను. ఆర్యపుత్రులకు శతసహస్ర ప్రణామములు. తమ యనుగ్రహమునకు సర్వదాకృతజ్ఞను. ఇదే తమయానతి నిముసములో నిర్వర్తించెదను.

రాః—దేవీ! మఱియొక ముఖ్యవిషయము చెప్ప మఱచితిని.

సీ:—ఏమది ?

రాః—వనవాసము పదునాలుగేండ్లు నేను బ్రహ్మచర్యాదినిష్ఠుర నియమములతోగూడిన వాన ప్రస్థాశ్రమధర్మముల నెఱపవలయునని కైకేయీమాత యనుజ్ఞ.

సీ:—మంచిది గృహస్థవానప్రస్థ ధర్మముల రెండిట భర్త ననుసరించినదే గదా సహధర్మిణి.

రాః—(మందహాసముతో సీతాదేవి వెన్నుదట్టును.)

---

## బాల!

గుంటుపల్లి వెంకటేశ్వరరావుగారు

చతురవార్ధిపరీత విశ్వంభరాత
లంపుతూగుటుయ్యాల పాలకుండవీవ!
ఆస్యబింబాన మందహాసాంకురములు
లాస్యమాడునుబాల! విలాసగతుల.
సాంద్రరుచులీను మృదుముఖాబ్జంబు వింత
వింత భావాలమూర్తితో వెలయుచుండు
కష్టసౌఖ్యాల పొలిమేరగంట్లు దాటు
నిత్యకృత్యమేడ్వగ నగ నీకుబాల!
వచ్చిరానట్టి బిలిబిలిపల్కులాడి
అమ్మ! అమ్మంచుబిలచి నాయాసమంది
మెత్తనిగులాబిరేకుల పెదిమలదుతు
ఆమెరాక నీకును ముదమగును బాల!
పదినెలలుమోసి కన్నట్టివ్రతఫలమని
ఆమెచేక్కిళ్లనిమిరి ముద్దాడబోవ
కాలియందెలు ఘలుఘల్లుఘల్లురనగ
మృదుకరంబులెత్తెదవు హసించిబాల!

నిన్నుముద్దాడ నేతెంచుచున్నయెరుల
ఒకపరింగాంచినవ్వి మరొక్కతూరి
హృదయముద్రవింప నేడ్చెద విట్టిచెయ్ది
ఎవరికడనభ్యసించితి వీవుబాల!
నీకు నలుసంతకాటుక నెమ్మదిఁకడ
వడిగనయనాంబుదముల బాష్పములువ్రాలి
కఠినహిమఖండహృదయమల్ కలుగజేసి
వేఁడికన్నీటి జాలునల్లోడుబాల!
నదమలానంద సహృదయసమయమగుట
ప్రకృతివైచిత్ర్య భావపరంపరాను
భవముగణియించి సుఖదుఃఖభావమెఱుగు
పేర్మి ప్రకృతిస్వరూపుడవు బాల!
పాలమునిపండ్ల దూసుకవచ్చువేఁత
నవ్వ చల్లనివెన్నెలల్ నాట్యమాడి
నలుగడఁ పూఁత పసిఁడి మెఱుగులనుదిద్దు
గృహమువు బాలకశాంకుడవీవు బాల!

# విమానయానము

మిసెస్ హిజాబ్ ఇమ్‌టియాజ్ ఆలి 1908 వ సంవత్సరము జన్మించిరి. ఈమె వైమానికురాలేగాక కవయిత్రికూడ. ఉర్దూ సారస్వతమునందు ఆధునిక కవయిత్రులందీమె యగ్రస్థానమువహించినదని చెప్పబడుచున్నది. ఈమె పుట్టుకతో కవయిత్రి; పరిశ్రమతో కవిత్వ మలవరిచికొన్నదిగాదు. మహమ్మదీయసంఘమందలి పరదా మొదలగు దురాచారములను తీవ్రముగ ఖండించుచు పెక్కుపుస్తకముల రచించి ప్రసిద్ధిజెందిన నీమె తల్లినుండియే నీమెకు కవిత రచనాశక్తి సహజముగ నలవడినది.

కీర్తిశేషులైన సయ్యద్ మహమద్ ఇస్మాయిల్‌గారు యీ కవయిత్రితండ్రి. వారు నైజాము నవాబుగారివద్ద గనులకును రైళ్లకును సహాయకార్యదర్శిగా బనిజేసిరి. వారు మహమ్మదీయవనితల యభివృద్ధికై నిరంతరము కృషిసల్పినవారు; నవీనాభిప్రాయములతో నేకీభవించి పాటుబడినవారు. వీరు యీ కవయిత్రిని రెండుసంవత్సరములక్రింద లాహోరు నం దొక సుప్రసిద్ధ పత్రికావిలేఖరికిచ్చి వివాహముగావించిరి.

నేను వైమానికవిద్యలో ప్రథమపాఠం 1935 డిశంబరు 23-వ తేదిన నేర్చుకున్నాను. నేనెపుడూ వైమానికురాలవుదు ననుకోనలేదు; కాని నా అభ్యాసం కొలదికాలంలోనే నా అభిప్రాయాన్ని మార్చేసింది. ఈ విద్యలో నాకుగురువు దస్తూర్ అనునొక పార్శీవారు. వారు వైమానికవిద్యలో యూరపు ఖండాన సంవత్సరాలకొద్ది అభ్యాసంపొందారు; ప్రస్తుతం ఇండియాలో నిపుణులైన వైమానికులలో నొకరు. వా రిపుడు Northern India Flying club లో బోధకులు.

చాలామంది మోటారు నడుపుటకు విమానము నడుపుటకు భేద మట్టేవుండదని ఆపోహపడుతూంటారు. కాని అది అలాకాదు; వీటికిమధ్య ఎంతో వాసివుంది. కారులోవున్న స్టియరింగ్ గేరుకిబదులు విమానంలో 'స్టిక్'అనే నడిపేసాధనం వుంటుంది. బ్రేకులు కొన్నివిమానాల్లోనే వుంటాయి; మిగతా వానిని నిలుపాలంటే మిషను నిలిపి వేయవలసి వుంటుంది.

మొదటిదినం నేను పదినిముషాలుకాలం నేర్చుకున్నా రెండోదినం యిరవైనిముషాలు ఈవిధంగా విమానము నడపడం క్రమక్రమంగా హెచ్చిస్తూ వచ్చాను. తెల్లవారి లేవడంతోటి విమానాశ్రయానికి పరుగెత్తేదాన్ని; సాయంత్రం మరొకమారు వెళ్లుతుంటాను. గాలితీవ్రంగా దుమారం రేగుతూన్న నాళ్లో నేను ఎగరడానికి సమ్మతించేవారుకారు. అంచేత తెల్లవారి పడకమీదనుంచి లేచి కిటికీలోచూచి ఆకాశం నిర్మలంగా లేకపోతే ఎంత నిరుత్సాహం పొందేదాన్నో నాకు బాగా జ్ఞాపకం వుంది.

నేనే ఏకాంతంగా ఎగిరేరోజులు త్వరలోనే వచ్చాయి. ఒకరోజు మాగురువుగారు నన్ను ఒంటరిగా పంపుతున్నాననీ కాబట్టి భయపడకూడదనీ చెప్పారు.

# నా మొదటి అనుభవాలు

ఈమె రచనలెంతో రసవంతముగనుండును. ఎంత సామాన్యవిషయమైనను, సామాన్యవస్తులైనను ఈమెదృష్టిలో మానవులకు మహోన్నతపాఠముల గఱపజాలి యుండును. ఈవిడకు గలిగిన తల్లివియోగము నామెచే హృదయమును గరగించు రచనల గావించినది. కొన్నియాంగ్లమునకుగూడ ననువాద మొనరింపబడినవి. ఉత్తరహిందూస్థానమున సుప్రసిద్ధముగు ఆలంగీర్, నెయ్‌రాంగియ్ – ఖయాల్, షాహాబ్ సాఫి, ఇస్మత్ మొదలైన ప్రతికలన్నియు నామె రచనలకై యువ్విళ్లూరుచుండును.

ఈ కవయిత్రి వైమానికయానమం దభిలాషజూపి అఖిలభారతదేశమందు వైమానికురాలుగా ఏ లైసెన్సుపొందిన ప్రథమమహమ్మదీయ నారీమణి. 'నా వైమానిక ప్రథమానుభవము'లని యామె రచించిన ఉర్దూ భాషావ్యాసమునుండి క్రిందవిషయము లనువదింపబడినవి.]

దానికి నాకు భయం వేయకపోగా ఎంతో సంతోషం కలిగింది. ఆ ఎగరడము తరువాత మూడురోజులకు నిర్ణయించబడింది. దురదృష్టవశాత్తున ఆమూడు రోజుల్లోనే నేను నడుపవలసిన విమానము ఇంకొకరిచే చెడగొట్టబడింది. మిగిలివున్న విమానాలు కూడా విమానాశ్రయంలో రిపేరీ చేయబడుతూవున్నవి. రెండు వారాల కన్నీ సిద్ధమవుననీ ఎ.డి.బి. మిషనుతో సిద్ధపరుస్తారనీ తెలిసింది. ఈమిషనంటే నాకు నచ్చదు; కాని కాలము వృథాగాపోకుండా దానిలోనే ఎగరాలని అనుకున్నా. మరుదినం ప్రశాంతంగా వుంటె విమానం నడుపుటకు అనుజ్ఞ యివ్వవలసిందంటూ గురువుగారి నడిగితే వారంగీకరించారు. నాభర్తగారికీ సమాచారం చెపితే వారెంతో ఆదుర్దాపడ్డట్టు కనబడ్డారు. నావిమానం నీలంగానూ తెల్లగాను వుండేది. దాన్ని ఇంజనీయరు శ్రద్ధగా పరిశోధిస్తూ వున్నట్టుచూచి నాకు అది రిపేరికి వెళ్లవలెనేమో అని అనుమానం గలిగింది. దస్తూరుగారు వచ్చి అక్కడున్న వాళ్లందరి ముందూ ఆదినము వుదయం భయపడకుండా ఎగిరేటందుకు పూనుకుంటావాఅని అడిగారు. వారినిచూస్తే నాకు భయమనే మాటేలేదు. కాని దస్తూరిగారి కొకవిధమైన ఆదుర్దా లేకపోలేదు. వారు కడపటివరకూ నాకేవో ఉపదేశాలిస్తూనేవున్నారు. నేను విమానయంత్రాన్ని స్టార్టు చేశాను. గురువుగారు సంతోషంతో చేతిగుడ్డ విసిరారు. వారి కభివందనాలర్పిస్తూ యెగరడానికారంభించాను. ఆక్షణంలో కలిగిన అద్భుతానుభవం ఎప్పటికీ మరుపుకురాదు. 2000 అడుగులు ఎత్తుకుపోయి క్రిందకుచూచాను. విమానాశ్రయము బొమ్మరిల్లులా కనపడింది. యంత్రాన్ని ఆపి క్రిందికి దిగనారంభించాను.

విమానయానంలోకల్లా దిగడమే కష్టం; వైమానికుడు దిగునపుడు ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకుని వుంటాడు. ఈ అద్భుతకృత్యాన్ని అతిశ్రద్ధతో నిర్వహించి సురక్షితముగా క్రిందకుదిగాను. వెంటనే అక్కడున్నవారంతా గబాగబా నావద్దకు వచ్చి అభివందనాలు అర్పించారు. కాని ఇంకా యెన్నో గంటలు ఆకాశంలోతిరిగి లైసెన్సు సంపాదించుకోవలసివుంది.

ఈలోపల దురదృష్టసంఘటన మొకటి సంభవించింది. నేనుఅభ్యసిస్తూవున్న మంచివిమానాన్ని యింకొ

కదు విరుగకొట్టారు. అది సరిపోవడానికి కొన్నివారాలైనాపడుతుంది. ఎండకాలంలో లాహోరునందు వుండడము అనారోగ్యమని త్వరగా కొండప్రదేశాలకు వెళ్లాలని నాకు వైద్యులు సలహాయిచ్చారు. అలోపలనే లైసెన్సురావడానికి నేను విమానము నడుపవలసిన రెండుగంటలకాలము ముగించుకోవాలి. అదేకాకుండా వాతావరణంకూడా మారిపోయింది; గాలి తీవ్రమైంది; దుమ్ము రేగుతూవచ్చింది. విమానాశ్రయములోనుండి యేవిమానమూ ఎగరకుండా నిలిపివేశారు. నేను కొండప్రదేశాలకు వెళ్లడానికి ఆరురోజులు మాత్రమే వ్యవధివుంది; అందుచే ఆమర్నాటో వాతావరణం ఎప్పుడు నిర్మలమవుతుందా అని కాచుకొని వున్నా. దురదృష్టం; వాతావరణం మరింత చెడింది. జూను 8వ తేది, కడపటిరోజు, తెల్లవారి లేచి చూతును గదా వాతావరణంలో ఎంతమాత్రమూ మార్పు కనపడలేదు; నా హృదయం క్రుంగిపోయింది; నేను దుఃఖము అపుకోలేకపోయాను. నాకు జూనులో లైసెన్సు రాకపోతే అక్టోబరువరకూ కాచుకొని వుండాలి. అబ్బ! నాలుగుమాసాలే! దస్తూరుగారి వద్దకు వెళ్లి, ఆదినం ఎగరడానికి అనుమతి యివ్వమని దీనంగా అడిగితే "ఏలాయిస్వను? ఈ వాతావరణంలో ఎగరడము చాలా అపాయకరము. విమానానికి కలిగే చెడుపు అలావుండనిచ్చినా నీ క్షేమాన్ని గురించి నా కెక్కువభయంగావుంది" అన్నారు. కాని నేను ఒకటే భిల్లాకముపట్టు పట్టితే వారంగీకరిస్తూ, "నీవు మాత్రం నన్ను ప్యాసింజరుగా విమానములోవుండుటకు ఒప్పుకోవాలి; అయితే నా రెక్కలు విరుగకుండామాత్రం చూడాలి" అన్నారు.

నా ఆనందానికి అంతములేకపోయింది. 1936 జూను 8వ తేది; నిప్పులు వర్షిస్తూవున్న దినము. ఆ దినం మధ్యాహ్నము చెట్టుచేమలన్నీ మండిపోయినట్లు గన్పించాయి. వాతావరణం దుమ్ముతో తీవ్రమైన గాలితో ఘోరంగావుంది. ఈస్థితిలో నేను విమానము నడుపుతూ గడపవలసిన కాలము 400 అడుగుల ఎత్తులో అంధకారములో ఎగురుచున్నట్టు కనిపించింది; క్రింద యేమిగాని కనిపించదములేదు. ఏచెట్టుకో, యే యింటికప్పుకో విమానము తగులుతుందేమో అని ఎంతో భయపడ్డాను. 1000 అడుగుల ఎత్తుకు ఎగిరాను; దస్తూరుగారు 2000 అడుగుల ఎత్తులో ఎగరాలని టెలిఫోనులో విడువక చెపుతూనేవున్నారు.

వున్నట్టుండి విమానము 600 అడుగుల క్రిందికి వచ్చింది; నాకు గుండె లవిసిపోయాయి; తప్పేమిటని దస్తూరిగారిని టెలిఫోనులో అడిగాను. వాతావరణము చాల చెడిపోయిందని, రాబోవు వాయుసంక్షోభాని కది గురుతని చెప్పారు.

భూమి పైభాగము సమానంగా లేనట్టే వాతావరణములోకూడ హెచ్చుతగ్గులుంటవి. ఇందుచేతనే విమానాలు వేలకొలది అడుగులు గబాలున క్రిందికి రావడము, ఉన్నట్టుండి పైకిపోవడమూ జరుగుతుంటుంది. అటువంటి సమయాలు వైమానికునికి అపాయకరముగావుంటవి. ఈలావున్నా నేను విమానాన్ని క్రిందికి దించకుండా రెండు గంటలు పూర్తిచేశాను. నేను భూమిమీద అడుగుపెట్టగానే హృదయం ఆనందముతో గంతులు వేసింది. నా శిక్షణకాలము ముగిసింది; నా కింక లైసెన్సువస్తుంది; వైమానికురాలనౌతాను. ఇప్పుడే విమానములోనైనా ప్రపంచములో యేమూలనైనా నేను సంచారము చేయవచ్చు. దస్తూరుగారుకూడా అమితంగా సంతసించారు. ఇంటికి పరుగెత్తాను. ఆదినము నేను నా భర్తగారితో మాట్లాడినదంతా వైమానిక విషయాలను గురించే.

నే నిప్పుడు నా వైమానికశిక్షను పూర్తిచేశాను. కాని నాభర్తతప్ప నా వైమానికశిక్షను ప్రోత్సహించినవారుగానీ, అభినందించినవారుగాని లేకపోయినందుకు నాకు విచారము గలిగింది; ఆ [illegible]కూడా అయింది. నాకు హృదయపూర్వకంగా అభినందనాలు అర్పించినవారొక్కరూ లేరు. కొందరు మిత్రులు

కూడా "ఇంత చిన్నదానవు. వైమానికశిక్షెందుకు?" అని మందలించారు. మరికొందరు "క్రమక్రమంగా క్షీణిస్తున్నావు వైమానిక శిక్షతో" అన్నారు. వైమానిక శిక్షపొందవలసినవారు అమితబలము పొందాలనే దురభిప్రాయము ఎంతోమందికి వుంది. జ్ఞానమూ సమయస్ఫూర్తివుండి సాధారణ ఆరోగ్యమున్నవాళ్లెవరైనా దీన్ని నేర్చుకోవచ్చు.

ముఖ్యంగా మహమ్మదీయులలో వైమానికశిక్ష విషయమై ఆలోచించరుకూడ. నాతోకూడ శిక్ష పొందినవారందరూ పార్శీవారో లేక క్రైస్తవులో. మాలో బి క్లాసు లైసెన్సుకు ప్రయత్నిస్తూవున్న మహమ్మదీయ డాక్టరొకడే వుండేవాడు.

పురుషులలోకూడ నాటి కొక్కరికైనా వైమానిక విషయాలలో ఉత్సాహముగాని, అక్కరగాని వుండకుండుట విచారమూ, ఆశ్చర్యమూ కలిగిస్తుంది. నాటికి తొంభైతొమ్మిదిమంది విమానములో కూర్చోనేదే మృత్యువునోటిలో ప్రవేశించినట్లని అభిప్రాయపడుతూవుంటారు. మనజీవితము అపాయాలు హాని లేకుండావుందా? వైమానికుడవడానికి అసాధారణ ప్రజ్ఞవుండాలనుకొనేవారినందరినీ నేను నాస్తికవాదులంగా అనుకొంటాను. మన పిల్లలకందరికీ వైమానిక విషయాల్లో రుచీ, ఉత్సాహము కలిగించవలసిన కాలము వచ్చినదనుకుంటున్నా. ఎందుకంటె ఇక కాలము జరుగుకొద్దీ, ప్రయాణాలకు వారాలకొద్దీ కాలము వృథాచేయకుండా దినాలలోనూ గంటలలోనూ ముగించాలని శీఘ్రగమనానికి అందరూ ప్రయత్నిస్తారు.

పరమేశ్వరుడు మన సోదరులకు ధైర్యమిచ్చి మనల సుశిక్షింపజేయుగాక.

---

తండ్రి:—వీధుల్లో అల్లరచిల్లరగా తిరగవద్దనీ ఎవరితోటీ పోట్లాడవద్దనీ చెప్పలేదూ? ఇప్పుడుచూడు ముందర రెండుపళ్లూ పోగొట్టుకున్నావు.

కొడుకు:—పళ్లు పోగొట్టుకోలేదు నాన్నా, జేబులోఉన్నాయి ఇవిగో.

* * * *

ఒకామె:—మీఆయనకు భోజనంలో ఏమి ఎక్కువఇష్టము?

ఇంకొకామె:—మాఆయనకు ఏవయితే ఇంట్లో చేయలేదో అవి బాగా యిష్టము?

* * * *

ఒకడు:—ఊళ్లో పోస్టాఫీసుఉండగా ఉత్తరం పొరుగూరుపెట్టెలో వేసి వస్తున్నావేమి?

మరొకడు:—ఈ పోస్టుమాష్టరు మా అంగడికి సరకులుకొనడానికి రావటంలేదు. అందుచేత నేను వుత్తరం వాడిపెట్టెలో వెయ్యదలచుకోలేదు.




ఆయుర్వేదాశ్రమము – మదరాసు.

# ద్రోహి యెవరు?

[ఆనందరావు తలిదండ్రులవద్దనుండి హరిజనులన్నా బీదసాదలన్నా సానుభూతీ సహాయపడడమూ నేర్చుకున్నాడు. తండ్రి శీను అనే హరిజనబాలకుని బ్రతికించుట ఆనందరావు మనసులో ఈ యాశయాలకు బీజమైంది. కొంతకాలానికి ఆనందరావు తలిదండ్రులూ, శీను తలిదండ్రులూ కూడ గతించారు. ఆనందరావు డాక్టరుగా చదవడానికి పట్నం వెళ్లాడు. శీను క్రూరాత్ముడైన రుద్రారెడ్డియింట్లో జీవితానికి కుదిరాడు.

ఆనందరావు చదువుకున్న తరువాత పూర్వపు టాశయాలకు వ్యతిరేకంగా మారిపోయ్యాడు. ఒకదినం శీను వచ్చి తన్ను రుద్రారెడ్డి కొలువునుండి తప్పించి ఏదైనా సాయంచేయుమని ఆనందరావును బ్రతిమాలాడు. అతడు నిరాకరించాడు.

ఆమరుదినం రుద్రారెడ్డి హత్య చేయబడ్డాడు. శీనే చంపివుంటాడని అందరూ అతన్ని వెదకుతూవుంటే ఆనందరావూ వారితో వెదకడానికి వెళ్లాడు. శీను ఒకచోట దాక్కొనివుంటే కనుక్కొని వెదకుతూన్న వారి కప్పగించాలని ప్రయత్నంచేస్తే, శీను రుద్రారెడ్డిని స్వప్రాణ సంరక్షణార్థం చంపానని, తన్ను రక్షించమని ప్రార్థించాడు. తరువాత]

ప్రాణభయముచేత మనిషి యెంతబాధపడతాడో నాకు అప్పటివరకూ తెలియదు. నా మనసు అంగీకరింపకున్నా శీను కథంతా నమ్మవలసిందే అని లోపల యేమో చెప్తున్నట్లు గనపడింది. ఆసమయంలో ఒకమనిషిని ఈ యనంతవిశ్వములో లీనము చేయుటకుగాని, స్వాతంత్ర్యమునిచ్చి జీవింపనిచ్చుటకుగాని నాకు సర్వాధికారమూ వుంది. ఆశక్తిని ఆటో యిటో ఉపయోగింపవలసిందే కాని మధ్యమార్గం అనేది ఉండదు. ఇదే పాశ్చాత్యప్రపంచంలో అయివుంటే హంతకుడు 'స్వరక్షణార్థం అట్టిహత్య చేశా' నంటే వాన్ని విడిచిపెట్టివుండేవారు. కాని మనదేశంలో సత్యాన్ని నమ్మేవారెవరు? నమ్మితే మాత్రము సుఖముందా! సత్యానికీ న్యాయానికీ చాలా దూరంకదా!

"దయవుంచండి బాబూ! బ్రతికిపోతాను. తమ బాబాయిగారుంటే నన్ను రక్షించివుండేవారు" అని శీను తన దుఃఖం వెళ్లబోసుకుంటూ పైవాక్యం తారాజువ్వలాగ నామీదికి వదలాడు.

ఆతడన్న యీమాటలకు నా అంతరంగం చలించింది. వణికింది. ఏదో గతకాలమునాటి విషయం జ్ఞాపకానికి వచ్చింది. మా నాన్న నాసమీపంలో నిలబడి శీనుప్రక్కను వాదిస్తూవున్నట్లు గనపడింది. ఆనాడు నేను నాన్నతో వెళ్లిందీ, శీను తండ్రి యిచ్చిన కుక్కపిల్లను తెచ్చుకున్నదీ, "నేనూ పెద్దయాక నీలాగే మాలవాళ్లకి సాయము చేస్తాను; మాలపిల్లలకు మందులిచ్చి బ్రదికిస్తాను" అని నాన్నతో అన్నదీ, నాన్న నావంక సంతోషంతో చూచి చిరునవ్వు నవ్వింది వక మెరుపులాగ మనోవీధిలో తళుక్కుమన్నది. ఇక నే నాగలేకపోయాను.

"శీనూ! నీవన్నది సరే. నాన్నవుంటే నీకు సాయం చేసివుండేవారే. నేనుకూడా చేస్తాను. నా హృదయంలో యింతవరకూ వున్న హూతుకాభిప్రాయాలకు

దైవం నన్ను మన్నించు గాక. నిన్ను హంతకుడని వాడి కప్పగిస్తే వారూ హంతకులవుతారు. నిజమే! ఎవరు హంతకులు గారు?"

"బాబూ! బ్రతికాను. మీరు నన్ను రక్షిస్తారని అనుకున్నా. మీరు పెద్దబాబులాగ మంచివారని నాకు తెలుసు" అంటూ శీను వెక్కి వెక్కి ఏడుస్తూనే వున్నాడు.

అప్పుడు నాకు సమీపంలో ఏదో శబ్దం వినవచ్చింది. వెంటనే పరిస్థితులన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. 'పొదలోకి వెళ్లిదాక్కో' అని శీనుకి చెప్పాను. అతడలాగు దాక్కున్నతరువాత వెదకుతూన్నవాళ్లని రమ్మని కేకలేశాను. పక్కపరుగులో వారంతా నావద్ద గుమిగూడారు. నేను శీనును పట్టుకొనివున్నా ననుకొన్నారు. వారందరూ 'వాడెక్కడ? వాడెక్కడ?' అని ఆదుర్దాతో అడిగారు.

"ఇక్కడుంటే పట్టుకున్నా. నన్ను క్రిందబడ ద్రోసి వాడు అదో ఆ దిక్కు పరిగెత్తాడు. నా కాలు దెబ్బతగిలింద"ని మడిచి చూపాను. వారంతా ఆదిక్కు వురికారు.

వారు వెళ్లిన శబ్దం అణిగినతరువాత 'వారంతా వెళ్లారా?' అని శీను మెల్లగా అడిగాడు.

"ఇదో! నీవు వేగంగా వెళ్లి మాయింట్లో దాక్కో" అన్నాను. వేణువు ఎత్తుకొని అతడక్కడ నుండి ఒకనిముషంలో మాయమయ్యాడు.

తగిలినకాలు తడుముకొంటూ మనస్సులో ఎన్నో ఆలోచనలు పరుగెడుతూవుండగా తిన్నగా యింటికి బైలుదేరాను. వెతుకుతూవుండే రుద్రారెడ్డిమనుష్యులనూ, పైగా చట్టాన్ని కన్నుగప్పి శీను నెలా రక్షించాలో అన్నదే నన్ను ఎక్కువగా కలవరపెట్టింది.

ఇల్లు చేరాను. శీనును ఒకచోట భద్రముగా దాచి రక్షించేమార్గ మాలోచిస్తూకూర్చున్నా. నా కొక ఆలోచనతోచింది. దాంతో కార్యక్రమమంతా యోచించాను. అదికూడా అపాయకరమైందే. కాని గత్యంతరం వుంటేగదూ!

మా యింట్లోవున్న పాతఅస్తిపంజరాన్ని విప్పి ఎముకలన్నీ ప్రోగుచేయమని శీనుతో చెప్పాను. అవి అతని ప్రాణాన్ని రక్షిస్తాయని చెపితే అతడు నమ్మలేదు. విప్పిన ఎముకలన్నీ నీటిలో నానవేశాను.

సాయంత్రమైంది; చీకటి అల్లుకుంటూ వుంది. వెదకుటకు వెళ్లినవారంతా వస్తూవున్నారు.

"దొరికాడా?" అన్నా వారితో.

వారిలో ఒకడు 'ఊహూ' అంతమాత్రానికే విడుస్తామా? చిక్కేవరకూ వెదకుతాం. మీకు కాలు ఏలాగుందీ?" అన్నాడు.

"కాలే తగిలివుండకపోతే శీనును ఈ వేళకు పిండి క్రింద కొట్టివేసివుండేవాణ్ణి" అన్నా కోపంగా.

"నిజమే. మీరు మీ నాన్నగారిలాగ కాదని వీళ్లతో నే నిదివఱకే చెప్పాను. మీ నాన్నగారికి యీ మాలవెధవలంటే మహాదయ" అన్నాడు.

"సరే వెళ్లిరండి" అని లోపలకి వెళ్లిపోయాను.

రాత్రి మాటుమణిగేవఱకూ చీకటింట్లోనే కూర్చునివున్నా. నేను పన్నివుండే పన్నాగంలో జయించానా సరి. లేదా శీనును రక్షించలేను సరి గదా; నా కంఠానికి వురితెచ్చుకున్నట్టే.

అర్ధరాత్రి దాటింది. నేనూ శీనూకూడా మేలుకొనే ఆలోచించుకుంటూవున్నాం, మాట్లాడకుండా. తరువాత నేను మెల్లగా నానవేసివున్న ఎముకలనన్నిటినీ సంచిలో వేసి మూటకట్టాను. శీనుతో "శీనూ! నీ పిల్లంగోవిని పోగొట్టుకోవడం నీ కిష్టమేనా?" అని ప్రశ్నించాను.

"మీరు తప్పితే ఈ ప్రపంచంలో ప్రాణస్నేహితుడు ఈ వేణువే. మీరు కావాలంటే దీన్ని

పట్టుకెళ్లండి" అని వేణువు యిచ్చాడు. అది తీసి కొని ఒకగుడ్డను కిరసనాయిల్ లో ఒక కఱ్ఱకొనకుచుట్టి ఎముకలసంచి బుజానవేసుకొని బైలుదేరాను.

మాయింటికి రెండు ఫర్లాంగులదూరంలో మా కొక బావివుండేది. దానిసమీపంలోనే వ్యవసాయ దార్ల వుపయోగానికి మానాన్న ఒక పెద్దపూరిల్లు కట్టించాడు. చుట్టూ ఏటేటివో చెట్లు వేయించాడు. దానికి దగ్గరగానే కసవువాము లుండేవి. పగలంతా రైతు లక్కడున్నా రాత్రుళ్లలో అక్కడెవరూ సాధారణంగావుండరు.

నేను పైవస్తువులన్నీ మోసుకొని కాలునొస్తున్నా గబగబా ఆయింటిని సమీపించాను. బైటనే పిల్లంగోవిని పడేశాను. లోపలకువెళ్లి ఒకమూలగా సంచిలో వున్న ఎముకలన్నిటినీ కుప్పపోశాను. బైటకువచ్చి మారుకు కిరసనులో తడిపిన గుడ్డతో నిప్పంటించాను. చూస్తూవుండగానే మంటలు వ్యాపించాయి. ఏలా పరుగెత్తానో తెలియదు. నిముషంలో యింటిలో పడ్డాను. మేడమీదకు వెళ్లిచూచాను. రాత్రంతాకూడా శీనుని వెదకుతూన్న మనుష్యులంతా కాలుతూవుండే యింటివైపు కేకలేస్తూవస్తూన్నట్లు గనిపించింది. పక్కనవున్న గడ్డివాములుకూడా అంటుకొన్నవి. అక్కడ ఒక పెద్దగుంపు చేరింది. ఒకరిద్దరు మాయింటివైపు పరుగెత్తుకొనివచ్చారు. నేను గది లోపలకువెళ్లి పడకమీద కూర్చున్నా. వచ్చినవాళ్లు నన్ను పిలుస్తూ గట్టిగా తలుపుతట్టి అరవడాని కారంభించారు. క్రిందకువెళ్లి కళ్లు నలుపుకుంటూ, 'ఏమిటి సమాచారం' అన్నాను.

"మీయిల్లూ గడ్డివాములూ కాలుతున్నాయి బావి దగ్గర" అన్నారు.

"ఎందుకు? కారణమేమిటి? చూద్దాం పదండి" అంటూ వాకిలితలుపు తాళంవేసి వారివెంట కాలుతూ వున్న చోటు చేరాను. అదివఱకే కప్పు కాలి లోపల పడ్డది. చుట్టూవున్న వాములన్నీ కాలి పోయాయి. గుంపుచేరినవారంతా నిప్పు ఆర్పడానికి ప్రయత్నిస్తూవున్నారు.

"ఏలా అంటుకుంది" అని ఒకరిద్దరిని ప్రశ్నించాను. వారు 'మేమూ అదే ఆలోచిస్తున్నాం' అన్నారు.

ఇంతలో వకడు శీను పిల్లంగోవి తీసుకొనివచ్చి "డాక్టరుగారూ! దీనికేమంటారు!" అని నాదగ్గరిచ్చాడు.

నేను ఆశ్చర్యంనటిస్తూ "ఓహో! ఇది శీను పిల్లంగోవి. ఇది ఇక్కడికి ఏలావచ్చింది" అన్నా. "ఔనాను! వానిదే! వానిదే!" అని అందరూ అన్నారు.

బహుశా శీను మిమ్మల్ని తప్పించుకొని ఎక్కడో దాగివుండి రాత్రికాగానే దీల్లో దాక్కొందామని పరుగెత్తివచ్చి అవసరంలో ఇది క్రిందబడవేశాడేమో?" అని ఒకడన్నాడు. "దాక్కొనివుంటే బాగా మాడివుంటాడులే. వానికిదే తగినశాస్తి" అని యింకొకడన్నాడు.

నాకు సంతోషం ఇంతా అంతా కాదు. నా యుక్తి చక్కగా పనిచేసింది. అన్నీ ఈలాగే సరిపోతే ఎంతబాగుంటుంది అనుకున్నా. అక్కడ చేరిన వారంతా ఏలా నిప్పంటుకుంది అని కొందరు, చావనీ మాలవెధవ అని కొందరు, పాపం డాక్టరు గారికి ఎంతనష్టం అని కొందరు ఇష్టమువచ్చినట్లంతా మాట్లాడుతూ యిండ్లకు వెళ్లసాగారు. వాళ్లలో మా రైతులను ఇద్దరినిమాత్రం వుండమన్నా. ఎందుకంటే కాలినయింటిని వెదకించి వాళ్లకూ ఆ ఎముకలను చూపించి శీను ఆయింట్లోనే చచ్చిపోయాడని సాక్ష్యం యిప్పించడానికి.

తెల్లవారింది. యింకా మసక మసకగావుంది. కాలినస్థలమంతా కఱ్ఱలతో వారిని వెతకమని నేను చూస్తూ నిలబడుకున్నా. వారు కొంతసేపు వెతికారు.

ఏమీ కనపడలేదు. కాని మరికొంతసేపటిలోనే వారు ఎముకలకుప్పను గుర్తించారు. వానిలో పుర్రె కొంచంమాత్రం కాలివుంది. ఇతరా ఎముకలుకూడ పూర్తిగా కాలలేదు. వెతకుతూవుండగానే పైన కాలుతూవున్న దూలంవిరిగి సరిగ్గా ఆకుప్పమీదపడ్డది. అది ఎముకలను నిర్విశేషంగా కాల్చివేస్తుంది గదా అని సంతోషించాను.

"ఈ మాలవెధవతో ఇంక బాధవుండ"దని యిష్టంలేకున్నా ఆరైతులతోకూడ నేనూ అన్నాను.

అక్కడినుండి మాయింటికి మార్గంపట్టాము. త్రోవలోనే సబ్ యిన్ స్పెక్టరూ నలుగురుపోలీసు జవానులు ఎదురయ్యారు. "శీను మీ బావివద్ద యింటిలోపడి కాలిపోయాడట వెళ్లి చూడాలి మీరుకూడారండి" అన్నాడు సబిన్ స్పెక్టరు.

"ఇపుడే అక్కడనుండీ వస్తున్నాం. మేము వెతికాము. ఎముకలుమాత్రం కన్పించాయి. అంతలో కాలుతూవున్న దూలంపడింది వాటిమీద; ఇదివఱకు భస్మమైవుంటాయి. వెళ్ళ వుపయోగంలేదు" అన్నా.

"నిజమేసామీ! మేముకూడా చూచాము" అని నావెంబడివున్న రైతులన్నారు.

"అలాఅయితే పోవడమెందుకుగాని చచ్చిపోయినట్లు మీరు సర్టిఫికేటివ్వండి. ఈరైతులను సాక్షులుగా పెట్టి రిపోర్టువ్రాస్తాను. సరి పోతుంది" అన్నాడు సబిన్ స్పెక్టరు.

"అలాగే"నన్నాను.

ఈవిధంగా అధికారరీత్యా శీను చచ్చిపోయాడు. హంతకుని వెదకిపట్టి శిక్షింపవలసిన పనిలేకపోయింది. అదెలాగో ముగిసిందికాని శీనును ఏలాగ దూరంగా పంపించాలి ఎవరికంటాపడకుండాఅని ఆలోచించాను. రెండుమూడురోజుల్లోనే నేను పట్నంపోతున్నాననీ త్వరలోనేవస్తాననీ చుట్టుపక్కలవారలతో చెప్పాను.

ఒక వాటిరాత్రి శీనుతోకూడా రైలుదేరి స్టేషనువకు వెళ్ళాము. రైలులో బెజవాడ చేరాను. అక్కడ నేను శీనుకు ఏబదిరూపాయలు చేతికిచ్చి ఎక్కడైనా వెళ్లి బ్రతుకొమ్మన్నా. ఆసమయములో శీనుస్థితి వర్ణించడానికి వీలులేదు. రక్షించిన నన్నువీడి ఏలా పోవడమో అతనికి తెలిసిందికాదు. ఇంతకుముందు గ్రామంవిడిచి బైటపోయినవాడేకాదు. ఇంతకూ వాని కెవరూలేరు. వెళ్లకుంటేతీరదు. విడవలేక విడువలేక సంతతధారగా కన్నీరుకారుస్తూ నన్ను వదిలి వెళ్లిపోయాడు. నేనుపట్నంవెళ్లి వారంరోజులుండి తిరిగి వూరుచేరుకున్నా. ముందువలెనే నా ప్రాక్టీసుచేసుకోడాని కారంభించాను.

ఈ విషయాలన్నీ జరిగి సంవత్సరంకూడా కాలేదు. ఇంకా మనోవీధిలో అస్పష్టంగా కనబడుతూనేవున్నవి. ఇంతలోనే నాజీవితంలో మరొక అధ్యాయం ఆరంభించేవిషయాలు తటస్థించాయి.

మాగ్రామానికి రైలుస్టేషనుకు ఒక మైలుదూరం కూడావుండదు. అయినా నాకు ఆస్టేషనునకు బదిలీ అయిన నారాయణరావునుగురించి తెలిసికొనడానికి సమయముగాని ఆవశ్యకతగాని లేకపోయింది. ఒక దివము సాయంకాలము నారాయణరావుగారువచ్చి తనకుమార్తె నొకమారుచూడవలెనని ప్రార్థించారు. ఆయన మాటలాడిన నాలుగుమాటలే నన్ను ఆతని కన్నిహితునిజేశాయి. ఆయనఇంటికి వెళ్ళాను.

విజయ నారాయణరావు కేకపుత్రిక. పదహారేళ్లుంటాయి. ఆవిడకుసౌందర్యం అట్టేలేకపోయినా ఎంత స్వల్పకాలం ఆమెతోమాట్లాడినవారైనా ఆవిడ పైన ఒకవిధమైనఅభిమానం చూపకుండావుండలేరు.

విజయకు చాలకాలంనుంచీ జ్వరంవస్తూవుండేదట. నే నావిడను పరీక్షించినసమయాన్నే అదికేవలం జ్వరంకాదనీ క్షయరోగచిహ్నమనీ కనుగొన్నా. ఆరంభదశ దాటినట్లు కనపడింది. ఎంతోకష్టపడితేనే గాని విజయదక్కదని నాకపుడేతోచింది.

మందు లివ్వడానికిముందే విజయకు నాహృదయం ఇచ్చాను. మందుకర్చుకు వారివద్ద డబ్బు పుచ్చుకొన డానికిముందే విజయహృదయం పుచ్చుకున్నాను. ఒక వేళ బ్రతికి బైటబడితే నావిషయమై విజయ ఆశ పెట్టుకోవచ్చు ననుకుందేమోగాని విజయ ఎవరికీదక్కని స్థితికిపోయిం దనేసంగతి నాకు బాగాతెలుసు. అయితేమాత్రం?

విజయఅమాయకత్వం, కోమలత, సున్నితమైన తెలివీ, సౌమ్యతా, పైగా ఆ విడకు కలిగిన అఘోర రోగమూ చూచి నాకు మొదటినుండీ ఒకవిధమైన అభిమానమూ జాలీ కలిగాయి. ఆవిడకు నేనుచూపెట్టే అక్కరా, శ్రద్ధా, బహుశా నాయందొకవిధమైన భక్తి గౌరవమూ కలిగించివుంటాయి. ఈ 'ప్రిలిమినరీ' భావాలు ప్రేమగా ఎప్పుడుమారడాని కారంభించాయో, నేను వూహించలేను. ఏలాగైతేనేమి యిరువురి హృదయాలూ వక్కటైనవి.

రాత్రింబగళ్ళూ నిద్రాహారాలు మానేసి కంట వత్తిడుకొని విజయను బ్రతికించాలని నాశక్తిసామర్థ్యా లన్నీ వినియోగించాను. కాని వుపయోగంలేక పోయింది. విజయ అనంతవిశ్వంలో లీనమైపోయింది. తనతో నాహృదయాన్నికూడా తీసికొని వెళ్లింది.

శూన్య హృదయంతో ఒక ప్రతిజ్ఞచేశాను. నా జీవితమంతా క్షయరోగంతో బాధపడే బీదపిల్లల బాగుచేయడానికి వుపయోగిస్తానని. వెంటనే నాకున్న భూములూ బ్రటలు అమ్మివేశా. డబ్బంతా తీసికొని పట్నంచేరుకున్నా. పట్నంవెలుపల అనుకూలమైన స్థలంకొని అందులో క్షయరోగులను కుదుర్చుటకు కావలసిన ఏర్పాటులన్నీ చేశాను. పదుహేనేళ్ల లోపలి బీదకుర్రాళ్లనే నేనంగీకరించుటకు తీర్మానించుకున్నా. నా ఆశ్రమంలో బీదపిల్లలు పెక్కుమంది చేరారు. వారు క్రమంగా ఆరోగ్యవంతు లవుతూ వుంటే నా శూన్యహృదయానికి ఒకవిధమైన ఆనందం కలుగుతూండేది.

పదిహేనేళ్లుగడిచాయి. నా స్వంతఆస్తి మొదట సుమారు కొన్నిలక్షలైనా యితరుల సాయం నే నపేక్షించనందువల్ల క్రమక్రమంగా కరిగిపోయింది. ఇక స్వల్పకాలంలో ఇతరులసాయం లేకపోతే నే నతి కష్టంతోగాని నా ఆదర్శము నెరవేర్చుకోటానికి సాధ్యంకాదనుకునే స్థితివచ్చింది.

నా స్థితీ వుద్యోగమూ ఆశయాలూ వెల్లడిస్తూ మహనీయు లెవరైనాతోడ్పడాలని పత్రికల్లో మనవిని ప్రకటించాను. దయాదాక్షిణ్యములుగల మహనీయు లంతా తమకు తోచిన స్వల్పసహాయము చేశారు. కొంతమంది చేస్తామన్నారు.

ఈలావచ్చిన ఒకఉత్తరం నాకు అమితఆశ్చర్యం కలిగించింది. సహాయంచేయడాని కెంతో ఆదుర్దాతో వున్నాననీ, ఇంతకాలమూ తనకు తెలియక వూరు కున్నందుకు క్షమించాలనీ తాను ఫలానాదినం వస్తాననీ ఆవుత్తరంలోవుంది. క్రింద హరిదాసని చేవ్రాలు వుంది.

నాకేమితోచింది కాదు. వారు వస్తానన్న నిర్ణీత దినం ఎప్పుడువస్తుందాఅని కాచుకొనివున్నా. ఆ దినం వచ్చింది. వారూవచ్చారు.

ఆమహనీయు డెవరూకాదు. శీనే! మేమిద్దరూ కలసికొన్న కొంతసేపటివరకూ మంత్రముగ్ధులలాగ వున్నాము. నా హృదయం సంతోషంతో గంతులు వైచింది. శీనునోట మాట రాకుండ నాకుమోకరించాడు. రెండుచేతులా లేవనెత్తాను. ఎన్నిసంవత్సరాలనుంచో దూరంచేయబడిన తల్లీ తనయులూలాగ కౌగలించుకొని తన్మయత్వం చెందాము.

సుమారు యిరవైసంవత్సరాలునాడు నన్ను బెజ వాడలో విడిచిన తరువాత శీను ఉత్తరహిందూస్థానం చేరుకున్నాడు. వేణుగానంలోనే కాకుండా యితరా వానిలోకూడా అమితమైన సంగీతప్రజ్ఞ సంపాదించాడు. దాంతో పేరు గడించాడు. ఇంతలో పత్రిక

లలో నా మనవిని చూచాడు. అయస్కాంతంవద్దకు వచ్చే సూదిలాగు ఒకటే ప్రయాణం నావద్దకు. ఇది శీను-హరిదాసు-చరిత్ర.

నా ఆశ్రమములో నేవుండి తన దబ్బంతా నావశం చేసి ఇంకా తనవిద్యవల్ల యావజ్జీవమూ డబ్బుగడిస్తూ రోగగ్రస్థులైన పిల్లల కారోగ్యం కలిగించేటందుకు నా కన్నివిధాలా తోడ్పడుతానని నన్ను ప్రార్థించాడు. నాకు-ఎవరికికాని-అంతకంటె కావలసిందేమి?

ఆ సాయంత్రం ఆశ్రమంలో హరిదాసు వేణుగాన ప్రదర్శనం చేశాడు. ఆ గానామృతలహరి మరల నన్ను, మోడుబారిపోయిన మొద్దుకట్టెను చిగిరింప చేసింది. అప్పటి నాయానందం వర్ణించడానికి వీల్లేదని ఒకమారుచెప్పితే చాలదు.

మానాన్న నాకు నేర్పిన సహనమూ, అంత్యజాలమీది ప్రేమా లేకపోతే ఈ యానందం అనుభవించి వుండే వాణ్ణేనా అన్నది అపుడు నాకు జ్ఞాపకానికివచ్చింది. రుద్రారెడ్డి సాధ్యమైనంతమందిని సాధ్యమైనన్ని విధాలా నిరంతరమూ హింసిస్తూవుండే చట్టసమ్మతమైన హంతకుడు. అటువంటివాణ్ణి స్వప్రాణసంరక్షణార్థం తెలియక చంపినశీను హంతకు డెలా అవుతాడు. నేను ఘాతుకాభిప్రాయాల్తో హంతకుడని శీనును వారికా నాడు అప్పగించకుండా వారికీ ప్రభుత్వానికీ ద్రోహం—అది ద్రోహమైతే-చేశానని లోకం అంటుందేమో? అలా అప్పగించివుంటే వా రతన్ని చీల్చి చెండాడి వుండేవారుగదూ! హంతకుడని శీనును అలా చేసివుంటే వా రేమవుతారు? ఈలాచేయదలంచుకొన్న సంఘానికే నాతోకూడ యావజ్జీవము శీను సేవచేయ దలంచుకొన్నాడుకదా! హంతకుడని శీను నానాడు తుద ముట్టించివుంటే వారినాకు ఆత్మద్రోహులు కారూ! నేను వారితో చేరివుంటే అంతేకాదూ! అనే ఆలోచనతో నాకు కళ్ళలో నీళ్లు తిరిగాయి. నా ప్రవర్తన లోకదృష్టిలో ఏమైనా దైవంమాత్రం సంతోషిస్తాడు.

శీను వచ్చిననాటినుండీ నా ఆశ్రమంలో కార్యక్రమము నిరంతరాయంగా జరుగుతూవుంది; ఆరోగ్యాభివృద్ధి చెందుతూవున్న పేదపిల్లలతో కలకలలాడుతూ వుంది. ఈలాగే మాయిరువురి జీవితాలు తుదవఱకూ సాగిపోతుంటాయని అనుకొంటాను.

[స్వేచ్ఛానువాదము చ.రా.]

---

## ఉగాది కానుక

విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తిగారు ఎం.ఏ.

తే. గీ. ఆర్తులై హైందవుల మొఱ యాలకించి
ధర్మసంస్థాపనార్థ మీ తరుణమందు
నభయహస్తంబుతోడుత నవతరించు
నీశ్వరుం డీప్సితార్థంబు లిచ్చు మీకు.

# స్త్రీలు నాగరికతాభిలాషులైనాకూడా—

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

సింగు టీ ట్రే తీసుకువచ్చి టేబిల్ మీద పెట్టాడు. రాత్రిజరిగిన చిన్నకలహంవలన ప్రమిలా ప్రసాదులముఖాన్న సంతోష చిహ్నాలు కనిపించడంలేదు. వాటిస్థానాన్న కోపంచిహ్న లాక్రమించుకొని వున్నాయి. అలవాటుచొప్పున టీ ట్రె తేగానే టీకలిపి భర్త కందివ్వలేకపోయింది ప్రమిల. దగ్గరనే వున్న కిటికీగుండా శూన్యతాయన పథం కేసిచూస్తూ కూర్చుండి టి ట్రే బల్లమీద పెట్టినదికూడా గమనించకుండా ప్రసాదు తనకుతానే టీ కలుపుకుని త్రాగబోతుం డగా ప్రక్కకు-తిరిగిచూచింది ప్రమిల. భర్త తన్ను పలకరించకుండానే టీ త్రాగడం గమనించింది. యేమనుకుందో చటాలున తానుకూడా టీని సేవించడం మొదలు పెట్టింది. బుర్రుసకారువచ్చి యింటిముంగట ఆగిన చప్పుడయింది. మేడమీదకు సింగు వచ్చి ఒక విజిటింగుకార్డు ప్రసాదుకం దిచ్చాడు. అది చదువుతున్న ప్రసాదు ముఖకళలు మారజొచ్చాయి. ప్రమిల యిదంతా గమనిస్తూ, యిక ఆగలేక భర్త చేతిలో విజిటింగుకార్డును చటాలున లాక్కొని యీవిధంగా చదివింది. మిస్. శ్యామ బి. యే. "యెవరండీ యీమె?" "యేం? నాక్లాస్‌మేటి" అంటూ చప్పున క్రిందకుదిగి మరుక్షణాన్న ఒకయువతితో ప్రవేశించాడు. ముగ్గురూ కుర్చీలమీద పరి సిష్టు లయ్యారు. సంభాషణంతా ఆంగ్లము లోనే జరిగింది. యెందుచేతో ప్రమిల శ్యామ వైపు సంశయదృష్టులతో చూడసాగింది.

ప్రసాద్ కాకినాడలో డాక్టరు. అతని భార్య ప్రమిలాదేవి యింటరుప్యాసయిన విద్యావతి. బి. యే. కూడా ముగించాలని అనుకుంటూవుండగానే ప్రమిలాప్రసాదులకు పరిచయమయి అపరిచయమే ప్రేమగామారి తుదకు వైవాహిక పాశములచే బంధింప బడ్డారు. యిరువురూ నూతనయౌవనములో నున్నవారే. యిరువురూ నవనాగరికతాభి లాషులే యిరువురూ ధనవంతులే. మించి యిరువురూ విద్యావంతులే. యికనేం వూళ్లో అంతా అదృష్టమంటే ప్రమిలా ప్రసాదులదే అనీ దాంపత్యమంటే వారిద్ద రినీచూచి తర్వాత యింకొకర్ని చూపవలె ననీ అంటూండేవారు. స్త్రీల దేమి? పురుషుల దేమి? ప్రతిసభలోను ప్రమిలాదేవి ప్రత్యక్షమౌతుండేది, స్త్రీలసభలో ఒంటరి గాను పురుషులసభలో భర్తతోగూడా. యిట్లా కాలంగడించిపోతుంది నవనాగరిక తాభిలాషులైన ఆ నవదంపతుల మధ్య యే అరమరలు లేకుండా.

కొంత సేపటికి శ్యామ వెళ్ళిపోయింది వాళ్ల యింటికి. శ్యామను కారువరకూ దిగబెట్టడానికి వెళ్తున్న భర్తని అనుసరించలేక పోయింది ప్రమిల. భోజనందగ్గర కూడ భార్యాభర్తలు సంతోషసంభాషణ జరుపలేదు. భోజనం కాగానే ప్రసాదు తిరిగి హాస్పిటలుకు వెళ్లిపోయినాడు.

భర్త వెళ్లిన తర్వాత కలత పెట్టుతున్న మనస్సుతో మంచంమీద వాలి తిరిగి 4 గంటలకి నిద్రలేచింది. లేవడమే భర్త బెడ్డింగ్ కనిపించలా గదిలో. గది నలువైపులా చూచే సరికి ప్రసాద్ టిఫిన్ బ్యాస్కట్ హాండు బేగ్ కూడా కనిపించలా. తన టేబిల్ మీద యేదో తపతపమని గాలికి కొట్టుకుంటూంటే దగ్గరకు వెళ్లి చూచింది. అనుమానించినట్లుది తనభర్త స్వదస్తూరీతో తనకు వ్రాసిన జాబే. యింతట్లో చటాలున సింగు ఆగదిలోకి వచ్చి "అమ్మా! బాబుగారు తొందర పనిమీద యిప్పుడే పట్నం వెళ్ళారు. మీరు నిద్రపోతున్నారని లేపలేదు. అదిగో జాబు తీసి చదవండి బోధపడుతుంది''అని అన్నాడు. "సరే నీవు వెళ్లు నే చదువుకుంటా" అని సింగు వెళ్లిన వెనుక గదితలుపు గడియపెట్టి కొట్టుకుంటూన్న హృదయముతో మంచంపై కూర్చొని యీ క్రిందివిధంగా చదివిందా జాబును ప్రమిల.

ప్రమిలా! నీకీవిధంగా జాబు వ్రాయవలసి వస్తుందని నేనిదివరకు వూహించనైనా లేదు. గాని విధివిధానమహిమచే నీకీ జాబీమాదిరిగా...యిదంతా యెందుకు? ప్రస్తుతాంశాన్ని వ్రాస్తా. శ్యామలపరిచయమైన మరుక్షణాన్నే నీవు నాహృదయములోనుండి తొలగి ఆస్థానాన్న శ్యామ ఆక్రమించుకొన్నది. నీకీవిధంగా కఠినంగా వ్రాసినందులకు క్షమించు. ప్రస్తుతమవబోయే మా వివాహము నీకండ్లయెదుట జరిగిన నీకొకవేళ మనః కష్టము కలుగుతుందేమోనని తలచి నే నీప్రయాణానికి పూనుకున్నా. నాల్గయిదు దినాల్లో మావివాహము యిచ్చటే జరుగుతుంది. మేము తిరిగివచ్చేసరికి నీవు నీతండ్రి వద్దకు వెళ్లి మాగృహాన్ని మాకు వదలివేస్తావని తలంచెదను.

యిట్లు నిన్ను పరిత్యజించిన భర్త
పి. యస్. యెన్. ప్రసాదు.

టు మిస్ కె. ప్రమిలాదేవి.

చదువుతూనే ప్రక్కమీద స్మృతితప్పి పడిపోయింది ప్రమిల. గవాక్షముగుండా వస్తూన్న చల్లని మలయమారుతంవల్ల తెప్పరిల్లి లేచింది. మనసు కుదుటబరచుకొని జరిగిందంతా జ్ఞాపకానికి తెచ్చుకుంది. యింతలో వంటమనిషి పిలిచింది అవతలినుంచి అమ్మా! అమ్మా! అంది. కండ్లు శుభ్రంగా తుడుచుకొని గడియతీసి, తన కాకలిగా లేదని, బాబుగారు క్యాంపు వెళ్లారని, గనుక ఆపూటకి వంట అవసరం లేదని, వంటమనిషితో చెప్పి ఆమె వెళ్లిన తర్వాత తిరిగి తలుపుగడియపెట్టి ఆలోచించసాగింది ప్రమిల. యేమీతోచక కొంతసేపు దుఃఖించడం మొదలుపెట్టింది. యింతలో గడియారం టంగున మ్రోగింది. చేతివాచీ

చూచుకుంటే రెండుగంటలు. పులికిపడిలేచి టేబిల్ దగ్గరకువెళ్లి కుర్చీలో కూర్చొని, గంటసేపు తంటాలుపడి, 4, 5 కాగితాలు చించి, ఆఖరు కీవిధంగా జాబువ్రాసింది.

ఆర్యా! వందనములు. యింతకంటె యింకేవిధంగాకూడా మిమ్మల్ని పిలువవలసిన అవసరంలేదని తలుస్తాను. మీ ప్రయాణ పూర్వం నాకు మీరు వ్రాసివుంచిన వుత్తరాన్ని చూచాను. అదిచూచినతర్వాత నాకు గల్గినఅవస్థ (అనగా సంతోషమా, దుఃఖమా, ఆందోళనా, ఆశ్చర్యమా, పగయా, ప్రేమయా) అన్న అంశాలు ప్రస్తుతం యిందులో వివరించడం, ప్రస్తుతం నాకున్న స్వల్పకాలాన్ని చెడగొట్టకోవడమే. కాబట్టి దాన్ని విడుస్తున్నాను. నేనింతవరకు భ్రమలో పడివున్నా. అది పిచ్చిభ్రాంతి అని మీవల్ల నేటికి తెలిసింది. అదేమనగా, ప్రస్తుత నవనాగరికతాయుగంలో పురుషులు నాగరికతాసక్తులైవున్నప్పుడు, వారి స్త్రీలుగూడా నవనాగరికతాసక్తులై యుండవలెననియు, అట్లుగాక పతిశుశ్రూషాతత్పరులై పూర్వ స్త్రీల ననుకరించిన భర్తయే నాగరికతా నారీమణీ కరస్పాలనానికే కలవరించిపోతారనియు, కాబట్టి యీనాగరికతాయుగంలో ప్రతిస్త్రీయు నాగరికతనే అనుసరించవలెనని తలంచితిని. గాని, తమస్త్రీలు తమతోపాటు నాగరికతాభిలాషులై యుండినాకూడ, యీ నాగరికతాయుగంలో, పరస్త్రీవాంఛకలిగి, అన్యస్త్రీకరస్పాలనానికై కలవరించే పురుషులుగూడ నున్నారని కలలోగూడ నేతలంచ లేదు. యిట్టివారికి...యిక నెందులకు. నేను భ్రాంతిపడ్డానని తెలిసికొన్నాను. నాతండ్రి వద్దకు వెళ్లమని నా కాజ్ఞాపించారు. ప్రస్తుతం నేను మీయాజ్ఞను మీరి 'నా' తండ్రివద్దకు కాకుండా 'మన' తండ్రివద్దకు వెళ్లుచూ మీగృహాన్ని మీకు వదలివేస్తున్నాను. ఆ తండ్రియే మీ నూతనదంపతులకు సకల శ్రేయములు చేకూర్చుగాక! యిక హెచ్చుగా వ్రాయలేను. వ్రాయటం అనవసరంకూడ. కడపటివందనములు.

వుత్తరం ఈవిధంగాముగించి టేబిల్ మీదపెట్టి, వెంటనేలేచి, గదిలోనిభర్త బీరువా తెరిచింది. అందులోనించి భర్త హాస్పిటల్ కొరకు తెప్పించివుంచిన ఆపరేషన్ సామానులోని ఒక పొడిమొనగల ఆయుధాన్నొకటి పైకితీసింది. విద్యుత్కాంతిపడి అది తళతళ మెరిసింది. వెంటనే పరుపుమీద వెల్లకిలాపండుకొని, వక్షస్థలాన్ని చూచుకొని దాంతో గుభీమని పొడుచుకుంది ఒక్కపోటు ప్రమిల.

"ప్రమిలా! ప్రమిలా!" అన్న ప్రసాదు యొక్క కాతర కంఠధ్వని విని పులికిపడి లేచింది ప్రమిల.

ఉదయభానుని అమృతమయకిరణాలు గవాక్షముగుండా గదిలోని వస్తుసముదాయములపైబడి వాటిశోభ నినుమడింప జేస్తున్నాయి. తనచేతిలో భర్తసులోచనములపెట్టి, తనచేయిపట్టుకొని, ప్రక్కన విస్మయదృష్టులతో తన్ని చూస్తున్న ప్రసాదు, కండ్లువిప్పగానే కనిపించింది ప్రమిలకు.

ప్రేమ, భయ, సంభ్రమదృష్టులతో చూడ సాగింది ప్రమిల భర్తను. "ప్రమిలా! అలా చూస్తావేం! యెందుకలా పిచ్చిదానివలె టేబిల్ మీదవున్న నాస్పెక్టికల్స్ కవర్ని తీసుకొని వుద్రేకంగా గుండెల్లోకి పొడుచుకుంటు న్నావు! యేమి! యేదైనా కలకంటు న్నావా?" అని చిరునవ్వుతో ప్రశ్నించాడు ప్రసాద్.

ప్రమిల తటాల్న లేచి కూర్చుంది మంచం మీద. అలా కూర్చుని నవ్వుతుంటూ యింతవరకు జరిగిన తన స్వప్నగతవృత్తాంతాన్ని భర్తకు తెలియజేయసాగింది.



దిగంతవ్యాప్త మొనరించుచు శోకమునుండి శోక, దైన్యములను, విభేదములను, అజ్ఞానమును తరుము గొట్టుచుండిరి. సోదరి సుప్రియ యొక్క సేవాసంఘమునజేరి యార్తులకు ఓపికకొలది తోడగుచుండెను.

ఈసమయమున శ్రావస్తిపురమండలమున వరుసగా రెండు సంవత్సరములు వర్షములులేక, పైరు పంటలు మాడిపోయి, దేశమున మహాక్షామము సంభవించెను దీనికితోడు ప్రచండభానుడు తీక్ష్ణాతపమును బరపి, నీరు నింకించుచుండుటచే జంతుజాలమును, మనుష్యులను తినుటకు తిండియు, కట్ట గుడ్డయు, త్రాగుటకు నీరును లేక వలపించుచుండిరి. వేలకువేలు జనులు అనుదినమును శాపోపహతులవలె మరణించుచుండిరి. ఈ యార్తనాదము చెవిబడగనే, బిడ్డని యార్తనాదము వినబడగనే పాలీయ పరుగెత్తివచ్చు తల్లివలె దయాస్వరూపుడగు శాక్యుడు తన శిష్యగణముతో శ్రావస్తి నగరమునకు విచ్చేసెను. పరిస్థితులను కండ్లారగాంచి, తాను సంవత్సరముల కొలది ప్రచారమొనర్చుచున్న ప్రేమమతమును క్రియాపూర్వముగ ప్రదర్శించదగిన తరుణ మరుదెంచెనని యామహాత్ముడు గ్రహించి, తోడనే పట్టణమందలి శిష్యులందరికిని తన్ను పురబాహ్యప్రదేశమున కలసికొనవలసినదిగా కబురంపెను.

నిరుపేద మొదలు మహాధనాఢ్యులవరకు నగరవాసులెల్లరును, నాయన యాజ్ఞప్తిప్రకార మొకచో సమావేశమైరి. సభ్యులెల్లరును వినమ్రులై, దీనాందోళితమానసములతో ప్రభువు ముఖమువంక చూచుచుండ బుద్ధుడు గంభీరస్వరముతో "ప్రియసోదరులారా? ఇచటి నిస్సహాయ ప్రజాసముదాయముల కష్టములు మీకు సువిదితములుకదా? ఈ యార్తుల బాధ లుడుపుటకును, కడుపునిండ భుక్తినొసగుటకును మీలో నెవరు పూనుకొందురు? మీ తోడిసోదరుడు గంజిలేక నిట్టుపాసములజిక్కి మరణావస్థయం దుండ, వాని కొసగకుండ మీరు గ్రుక్కెడునీరు త్రావినను, ఒక్కకబళము మ్రింగినను నది విషతుల్యమని గుర్తెరుగాక! నాకును, మీకును సోదరులును, ఈశ్వర సంతానమునునగు మీ యిరుగుపొరుగువారు గతిలేక, కట్ట గుడ్డయు, తిన తిండియు లేక పలవించుచుండ, మీరు మీయొక్కయు, మీ బిడ్డలయొక్కయు, యోగక్షేమములనే చూచుకొందురేని, మీ మతము నిరర్థకము? నాబోధలు నాటికేలయందలి విత్తనము లయ్యెననియు, నాజీవితము వ్యర్థమయ్యెననియు భావింతును! వీరికి తోడ్పడుటకు సమర్థులు మీలో నొక్కరును లేరా? యని ప్రశ్నించెను. ఆయన గంభీరవాణి యాప్రశాంతసభాస్థలమున మారుమ్రోగెను. ఆ విశాలజనసముదాయమునందు యొక్కడును బదులు చెప్పలేదు. అందు పెక్కండ్రు జమీందారులు, లక్షలకధికారులగు వడ్డీవ్యాపారులు, నగరవర్తకులు, కలపవర్తకులు, సాహుకారులు గలరు. వారిలో నొక్కరికిని స్వామికార్యము నిర్వహింప ధైర్యము లేదయ్యెను. వారిలో వారు, "కాలమనుకూలముగాలేక శిస్తులు చెల్లుటలేదని" యొకరును, "వ్యాపారము మందముగానున్నదని" యొకరును, "వడ్డీలు లాభములు తగ్గినవని" యొకరును, యీకారణములచేగాక లేకున్న మహాప్రభువు నాజ్ఞ శిరసావహించియుందుమని సణగుకొనజొచ్చిరి. తేజోపూరితదృక్కులతో భగవానుడు దిక్కులన్నిటిని గలయబరికించుచుండెను. శ్రీమంతులనుండి సహాయము లభించు నుపాయము గాన్పించలేదు. అందులకాయన విరక్తినొందక, వారి స్వార్థపరత్వమునకు జాలిపడి, కొంచెము విసుగుకొనుచు, తన సహచరులవంకకు దృష్టిని గురించెను. ఏమి యాశ్చర్యము? ఆ ధర్మసేవకుల సంఘమునుండి యొకయబల, కాషాయాంబరధారిణి, నలువదివత్సరముల ప్రాయముల యామె, యాపాదమస్తకమును కంపించుచుండ లేచి నిలువబడియెను. ఆమె మెల్లమెల్లగా స్వామిని సమీపించి "ప్రభూ! అనుగ్రహించి, నీ కరుణావేశమును నాపై బరపుదువేని, దేవరచరణసేవకులలో నధమా

ధమనగు నేనీ కార్యమును నిర్వహింప సిద్ధముగా నున్నాను! అనుజ్ఞయిండు" అని కన్నుల నీరునిండి, రుద్ధకంఠస్వరముతో వాక్రుచ్చెను. ఈమె సోదరి సుప్రియయే.

ఈ వింతను గాంచిన శ్రీమంతులు తమకండ్లను తాను నమ్మజాలకపోయిరి. వారిలో కొందరు అగ్రహచిత్తులైరి. "ఈ బిక్షుకి యెంత యహంభావి? మాబోటి జమీందారులు పూనజాలని మహాకార్యమును తాను నిర్వహించునా" యని యొకరును, "లక్షలాదిజనులకు అన్నదానము చేయుట వేడుకపని యనుకొంటివా" యని యొకరును "ఈమెకు నిశ్చయముగా మతిపోయినది. లేకున్న నిట్టి ప్రలాపము లాడదు. యీ పిచ్చిదానితో నేమిపని? ఈమెను వెడలగొట్టు"డని యొకరును యిటుల సభాసదుల హేళనలతో సభయందు రొదహెచ్చెను.

సువర్ణదత్తుడను వర్డీవ్యాపారి యామె నుద్దేశించి "సోదరీ! ఎంతటి సాహసము! లక్షాధికారులును, కోటీశ్వరులును పూననోపని యికార్యమును బిక్షుకివైన నీ వెట్లు సాధించదలచితివి? సర్వనాశనమైన యొకమండలము నుద్ధరించుటకు నీకు అక్షయ సంపత్తికలదా యేమి?" యని ప్రశ్నించెను. సోదరి సుప్రియ వినమితశిరస్కయై "సోదరులారా! నేను బిక్షుకినగుట నిక్కువము. కాని నాజోలె సామాన్యమని యెంచకుడు. నేను యింటింటికినిబోయి, మీ కరుణాప్రసాదములతో నాజోలిని అడుగడుగునకును నిండించి, యక్షయమగు దానితో వరుణదేవుని చినుకులు సర్వభూతధాత్రిని నిండించునటుల, గురుప్రసాదమున నీ మండలవాసుల నుద్ధరించగల"నని ప్రశాంత గంభీరస్వరముతో వక్కాణించెను. ఆమె గంభీర వాక్కులకు సభాసదులు మౌనముద్రితులైరి. కరుణామూర్తియగు భగవానుడామె శక్తిసామర్థ్యములను శంకింపలేదు. పరిపూర్ణహృదయముతో నామె స్థైర్యమును కొనియాడి, దీవించి పంపెను. మరియు నామె సాహసనిశ్చయము క్రియారూపము దాల్చునట్లు ప్రార్థన మొనర్చెను.

ఒకనాడు వైశాలియందు మహాశ్రీమంతుడైన చిత్రదత్తుని యనుగుకూతురు సుకుమారి సుప్రియ బిక్షుకియై, బుద్ధభగవానుని యాదేశములను నిర్వర్తించుచు, నేడు మహాధనాఢ్యులు సాధించజాలని కార్యమును నిర్వర్తింపబూనెను. ఆమె వెంటనే కార్యాసక్తయయ్యెను. ధర్మసేవకులందరును నామెకు హృదయపూర్వకముగా తోడ్పడిరి. సాధుసుప్రియ యింటింటికిని దిరిగి, బోధితులసహాయార్థము సాధన సామగ్రిని సంపాదించు నేర్పాటులొనర్చెను. ఆమె దీనరక్షణోద్యమము దినదినాభివృద్ధి నొందుచుండెను. స్వార్థరహితులగు నా సేవాదళము వారి కార్యదీక్షను గాంచి, శ్రావస్తియందలి శ్రీమంతులు తమ స్వార్థపరతకు లజ్జించి, పశ్చాత్తప్తులై వారికి క్రియాపూర్వకముగా తోడ్పడసాగిరి. సోదరిసుప్రియ నిద్రాహారము లెరుంగని యనవరతకృషి ఫలితముగా, నెలరోజులు గడువకుండనే యామె ప్రారంభించిన యుద్యమము సఫలమై, మండలవాసులందరకును పుష్కలముగా నాహారపదార్థములును, వస్త్రములును లభించెను. ధర్మదళాధిపతియైన సాధుసుప్రియ, యిల్లిల్లుదిరిగి రోగపీడితులకును, క్షామబాధితులకును ఆశ్వాసము కలిగించెను. తనదళముతో నామె యచట వర్షఋతుపర్యంతమునుండి యాప్రాంతీయుల కావశ్యకమైన సహాయమంతయు నొనర్చి, పిమ్మట తనసహాయము వర్షించు వేరొకప్రాంతమునకు వెడలిపోయెను.

సర్వభూతానుకంపములైన బుద్ధభగవానుని కారుణ్యామహోపదేశములు సార్థకము లేయని యాయమ తన కార్యదీక్షవలన ఋజువుపరచెను. రత్నగర్భయగు భారతమాతృగర్భమున నిట్టి కాంతారత్నములు పెక్కురుద్భవించి, మాతృసేవాపరాయణ లయ్యెదరుగాక!

# ప్రేమ—రాజ్యము

కృత్తివెంటి వెంకటసుబ్బరావుగారు

ఉ. నీయది నిర్మలాత్మ మహనీయపురాకృత పుణ్యరాశియుఁ
నీయది పారతంత్ర్య కరణీయములం దసహిష్ణుతాప్తియుఁ
నీయది రాజ్యతృష్ణ లణఁగింపని ప్రేమ రసానుభూతియుఁ
నీయది త్యాగవృష్టి పరిణేతృమనః పరిణామదృష్టియుఁ.

సీ. కూర్తువో ప్రేమపంక్తుల లోఁదిగినలోతు తీరిక వేళనీ తెలివికొలఁది
జపియింతువో నీ ప్రజారంజనమునకై క్రొత్తదారులు ద్రొక్క కోర్కెకొలఁది
తపియింతువో కిరీటధారణంబన భారమ్ముగా స్వానుభవముకొలఁది
తీర్తువో పదవిలో ధృతియేమి? పరువేమి? పరతంత్రమని త్యాగపటిమకొలఁది

గీ. చేర్తువో మఃజీ యనుభవసిద్ధసద్వి, వేకమును వెన్క వేదాంతవిదుల ప్రోల
నేమిదోఁచి దేశమీనుంటివో మహాత్మ, హీరమణి వేచి చూచుచున్నారు ప్రజలు.

గీ. ఆత్మదృష్టినిరోధకమధికతృష్ణ, ఐహికమునపరాధీన మవలనున్న
భూమి రాజ్యమ్మనిన వట్టి బూటకమ్ము, ప్రేమసామ్రాజ్యమే చాల పెద్దదనవో?
నిర్భరానందనిర్ణేతృ యుతమగుట, పేదలకు ప్రాణముల నిల్పు పెన్నిధిగద
సృష్టిమిథ్యయె కాదంత ప్రేమమయము, నదియె అమృతార్ప్యైక మధ్యాత్మికమ్ము.

సీ. తులతూఁగినావు నిస్తుల సౌఖ్యము లయందు జన్మమెత్తినదాది సకలనిధుల,
తులతూఁచినావులోతుల ప్రేమతత్వమ్ము తెలియనేర్చినదాది దిగ్భ్రమముగ
చవిచూచినావు రాజ్యనిరూఢభోగమ్ము లోఁబడ్డదాదితద్యోగమునకు,
చవిచూపినావు నిశ్చలపదత్యాగము నారితేరినదాది నన్నివిధుల,

గీ. చూచిచూపించు పరమభోగీ చరింపు,మిచ్ఛకముగాదు స్వాతంత్ర్య మెచ్చుచుమ్ము,
చేసిచేయించుకర్మయోగీ, సుఖింపు, పూజనీయము నీత్రోవయే జయమ్ము.

ఉ. లోకులు కాకులందు రవలోకనలేకయె వైచు కేకలే
కాకితనమ్మునందది చికాకునుగూర్చుచుగాని చెంతరా
నీకస్వచిత్తవృత్తి జనునేతకు కాకలు లేవు—అట్టినీ
రాకయుపోకయుఁ సదనురక్తికి కారణమౌనుపో కవీ.

గీ. కవియు కాముకుఁ డున్మాదకాలన మొకటి,వారిగతుల క్రమమెఱుంగ వలనుపడునె?
ఆంతరచ్ఛిద్రములు సువేద్యములుమీకె, మునిగి తేలుడు మీతలంపులను నృపతి!

# ఆ యధికారము
# ఆ గౌరవము మీదే





గృహపత్నిగానుండుట సామాన్యంబు కాదు. ఎవ్వరును గమనించని నూరువిషయములు గలవు. వాటిలో కొన్నిటిపై, స్త్రీలకే యధికారము. "టీ" తయారుజేయు పని వారికి ముఖ్యము. తెలిసిన స్త్రీ లీ దయాస్వరూపమైన "టీ"ని తమ పురుషుల కిచ్చుట మరువరు. నిర్దోషమైన యీ యారోగ్యపానమే సంసారానందము గల్గచేయుచున్నది.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూను "టీ" యొక్కొకరికిన్ని, మొత్తముగా నొకస్పూను యధికముగాను పాత్రములో వేసి, బాగుగా నుడకబెట్టిన నీటిని పోయవలెను. 5 నిముషములు తాళి, కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్చవలెను.

## సంసారమునకు తగుపానము—ఇండియా "టీ"

# పతివ్రత లోకకల్యాణమున కెట్లు తోడ్పడును?

౧

[శ్రీ రవీంద్రసారస్వతసమాజమువారి యాజమాన్యమున నీ మధ్యజరిగిన 'శ్రీ చెల్లాయమ్మ స్మారకచిహ్న వ్యాసరచనపోటీపరీక్ష'లలో యీ వ్యాసము ప్రథమముగా నిర్ణయింపబడినది. వ్యాసకర్త్రికి స్వర్ణపతకము బహుమాన మీయబడినది.]

* శ్రీమతి *
ముదుంబి లక్ష్మీదేవిగారు

'పతిరేవ వ్రతం యస్యాః సా పతివ్రతా'. పతియే వ్రతముగాగల స్త్రీ పతివ్రత. దేశముయొక్కయు తద్ద్వారా లోకముయొక్కయు ఔన్నత్యమునకు, సుఖమునకు, శాంతికి, కళ్యాణమునకు మూలకందము పతివ్రతలగు స్త్రీలే. మనభరతవర్షము పూర్వము మహోన్నతదశ ననుభవించియుండుట పతివ్రతలకు నిలయమగుటచేతనే. కర్మభూమియు, గొప్ప గొప్ప మహాపురుషుల కనినదియు, లోకకళ్యాణకరమైనదియు నగు నీ భరతవర్షము సీత, సావిత్రి, దమయంతి, అనసూయ మున్నగు మహాపతివ్రతల ప్రసవించి ధన్యతఁ గాంచినది.

లోక మనగా మానవసంఘము. ఈ మానవసంఘమునకు గృహమే ప్రాతిపదిక. గృహమునకు స్త్రీయే అలంకారము. గృహము కలకలలాడుచు నిత్యకళ్యాణము పచ్చతోరణమై వెలయుచుండవలెనన్న స్త్రీ ప్రధానురాలు. ఆమెయొక్క ప్రవర్తనయే ఆయింటి సౌభాగ్యమునకు, సుఖమునకు, శాంతికి కళ్యాణమునకు కారణమైయుండును. గృహకళ్యాణముద్వారా గ్రామకళ్యాణము, తద్ద్వారా దేశకళ్యాణము, దానిచే లోకకళ్యాణము చేకూరుచున్నవి.

పరపురుషుని కలలోనైన తలంచక మనోవాక్కాయకర్మల తనభర్తనే ప్రేమించుట ప్రతివ్రతాలక్షణములలో ముఖ్యమైనది. భారత భాగవతాదులయందు లోకాచారమునందు కూడ పతివ్రతకు కేవలము పై లక్షణ మొక్కటియే గాక దానితోపాటు మరికొన్ని పతివ్రతాలక్షణములు చెప్పబడినవి. అత్తమామల పూజించుట, ఆడుపడుచుల తోటికోడండ్ర నాదరించుట, కలహములు తంపులుపెట్టు గుణములేకుండుట, చాడీలు చెప్పకుండుట, అతిథి అభ్యాగతుల బ్రాహ్మణుల భోజనదానాదికములచే పరితృప్తులఁగావించుట, యింటి పనిపాటల స్వయముగా చక్కబెట్టుకొను నేర్పు, మిత

వ్యయముకల్గి నగనాణెములకై భర్తను వేధించుకొని తినకుండుట, యింటి దాసదాసీ జనముల పరుషోక్తులాడక ప్రేమచే పనులు గొనుట మున్నగులక్షణములు కలిగియున్న గాని పతివ్రత కాజాలదు. కుటుంబ సౌఖ్యమునకు మానవసంఘ కళ్యాణమునకు పై పతివ్రతా లక్షణములన్నియు స్త్రీలకుండుట ముఖ్యావసరము.

పరపురుషునికలనైన స్మరించక తమ యందే అనురక్తురాండ్రైయున్నను మిగిలిన పతివ్రతాలక్షణములులేని స్త్రీలెందరో కుటుంబ సౌఖ్యమును దూరముచేయుటను మన మందరము చూచుచునేయున్నాము. ఇట్టి సర్వలక్షణసమన్వితలగు పతివ్రతలు గావుననే సీత, సావిత్రి, దమయంతిమున్నగు పూర్వకాలపునారీమణులు లోకకళ్యాణము చేకూర్పగలిగి మనచే నేటికిని ప్రాతః స్మరణీయురాండ్రై ప్రసిద్ధికెక్కిరి. దీనికి పూర్వకాలపు గురుకులస్త్రీ విద్యావిధానమే కారణము.

పాశ్చాత్యులలో కూడ పతివ్రతలనే వున్నత కుటుంబములలో గౌరవింతురు. అత్యంత సంస్కారణావాసమగు రష్యా యందు సహితము పతివ్రతలుకానిస్త్రీలు నీచముగనే చూడబడుదురు.

క॥ తనమగని నత్తమామల
జననీజనకులను దన్ను సకలకులంబుల్
ఘనముగ సముద్ధరించెను
జనవరసావిత్రి దత్పుచరితమువింటే.

పతివ్రతయగు సావిత్రి తన పాతివ్రత్యమహిమచే యమధర్మరాజును సహితము మెప్పించి భర్తయగు సత్యవంతుని బ్రతికించుటయే గాక మామగారికి నేత్రరాజ్యలాభములు, తల్లిదండ్రులకు శతాధికపుత్ర సంతాన లాభము కల్గించి అనేకకళ్యాణ పరంపరల కాలవాలమైనది. ఇట్లే సీత, దమయంతి, అరుంధతి మున్నగు పతివ్రతలు, భర్త దరిద్రుడైనను తమ్ము నిర్దయతో అడవుల విడచినను అవమానించినను ద్వేషించక ఓర్పువహించి మనోవాక్కాయకర్మలచే భర్త శ్రేయస్సునే కోరి ప్రవర్తించి లోక కళ్యాణము చేకూర్చిరి.

క. ఉపవాసంబులు వ్రతములఁ
దపములు చేయేల భర్తదై వతమని నీఁ
మ్కపటతఁగొల్చిన సాధ్వికిఁ
నృపవర దుర్లభము లేదు నిఖిలజగములన్.

లోకసౌఖ్యమునకు మానవుల నీతినియమపూర్వకమగువర్తనమే కారణము. మానవులు స్త్రీపురుషభేదముచే రెండువిధములు. ఈ స్త్రీపురుషులకు పరస్పర ఆకర్షణశక్తి యొకటి బలీయమగునదికలదు. ఈయాకర్షణ యందు వుండవలసిననీతి నియమములకు మనఆర్యులు కొన్నిపద్ధతుల నేర్పరచిరి. ఇదే మన వివాహసంస్కారము. ఈ వివాహ సంస్కారము సరిగా ఆచరించుటచేతనే మనపూర్వులు పతివ్రతాసంతానమై, అంత మహిమాన్వితులై, బలశాలులై, ధీరులై, వీరులై, సమర్థులై, లోకకళ్యాణప్రదులైరి. చూడుడు భగవద్గీయందు ఆర్యధర్మవిదుడగు అర్జునుడు శ్రీకృష్ణునితో యేమిచెప్పుచున్నాడో!

శ్లో. స్త్రీషుదుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః।
......ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥

పతితురాండ్రగు స్త్రీలచే వర్ణసాంకర్యము, జాతికులధర్మముల వినాశములుకల్గి లోకము పాడగును. కావుననే లోకము బాగుపడవలెనన్న స్త్రీ బాగుపడవలెను. ఇందుకొరకై స్త్రీలయందు జ్ఞానము, విద్యావ్యాప్తి తప్పక కల్గవలెను. ప్రస్తుతకాలపు స్త్రీ విద్యావిధానము మిక్కిలిలోపభూయిష్ఠముగనుండి మనస్త్రీలను అధోగతిపాలుచేయుచున్నది. భోగలాలసత్వమును, భౌతిక వాంఛలను కల్గించి, సంఘాభివృద్ధికి పారమార్థికచింతకును దూరము చేయుచున్నది. ఇప్పుడిప్పుడు మన స్త్రీలు ఈ పాశ్చాత్యనాగరికత నుండి మేల్కాంచి స్త్రీవిద్యాసంస్థల నెలకొల్పి మరల తిరిగి మనజాతీయతను నెలకొల్ప ప్రయత్నములు సల్పుచున్నారు. ఈ స్త్రీవిద్య పూర్తిగా మనజాతీయతకు, సంఘమునకు, సాంప్రదాయములకు, అనుకూలముగ సంస్కరింపఁబడినపుడే మనస్త్రీజాతి పతివ్రతాజాతియై, మొదట "ఇంటగెల్చి రచ్చ గెలువవలె" నన్నట్లు ముందు గృహమును బాగొనర్చి తద్వారా దేశకళ్యాణమునకే గాక లోకకళ్యాణమునకు తోడ్పడును.

పతిప్రేమ, దేశప్రేమ, లోకప్రేమ అనునవి మూడును లోకకళ్యాణసాధమునకు మూడుమెట్లు. ఈ కీలకమును మనఆర్యులు గుర్తించియే స్త్రీకి లోకకళ్యాణసాధనిర్మాణమునందు పతిప్రేమను పునాదిగ నేర్పరిచిరి. జాతీయవిద్యాభ్యాసముచే స్త్రీ పతివ్రతగను దేశవ్రతగను చివరకు లోకవ్రతగను నైపోవుచున్నది. ముందు పతిప్రేమచే గృహమును ఉద్ధరించుకొనును. దీనిని సరిగా ఆచరించుటచే రెండవమెట్టగు స్వదేశప్రేమ అలవడి, తనదేశమునందలి పేదసాదల అభివృద్ధికి తోడ్పడు ఖద్దరువ్రతము, హరిజనోద్ధరణము, స్త్రీవిద్య మున్నగువాటి నవలంబించి స్వాతంత్ర్యమును సంపాదించి మాతృదేశము నుద్ధరించును. అనంతరము లోకమునంతను ప్రేమించుట నేర్చుకొని మానవులందరు ఏ జాతికిచెందినను ఏ దేశమునకు చెందినను స్త్రీలైనను, పురుషులైనను సరే అందరి శ్రేయస్సునకు పనిచేసి లోకకళ్యాణము చేకూర్చుచున్నది.

పూర్వకాలము మనపతివ్రతలు గొప్పవారని పూరకఅనుకొని ప్రయోజనములేదు. వారి సాంప్రదాయములను వారి ఆదర్శములను యీనాటి మన అస్వతంత్రభారతవర్షమునకు స్వాతంత్ర్యము సంపాదింపగల విధమున సంస్కరించుకొని స్త్రీలు లోకకళ్యాణమునకు తోడ్పడవలెను.

ప్రపంచయుద్ధము మరల వచ్చినచో లోకము నాశనమైపోవును. దీనినాపుటకు అహంభావ స్వార్థప్రేరిత దృష్టిగల పురుషప్రకృతి సమర్థమైనదిగాదు. ప్రేమనిలయులు, పవిత్రురాండ్రునగు స్త్రీలే తమ సంకల్పబలముచేతను భూదేవివంటి ఓర్పుచేతను

పురుషులను నడపించి, యుద్ధములు జరుగనీయకుండ ప్రపంచశాంతి నెలకొల్ప సమర్థలు. స్త్రీల పవిత్రశక్తి త్యాగములతోడ్పాటే గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమమును ఆసేతు హిమాచలపర్యంతము వ్యాప్తమొనర్చి ప్రపంచదృష్టి నాకర్షించ గల్గినది. సుశిక్షితలు పతివ్రతలునగు మన ఆర్యమహిళలే స్వదేశము నుద్ధరించుకొని లోకమంతటకూడ శాంతిని నెలకొల్పుటకు సమర్థురాండ్రై లోకకళ్యాణమునకు తోడ్పడగలరు. ఏతత్సిద్ధికై సర్వశక్తి మతియు పతివ్రతాతిలకమునగు లోకమాత దుర్గను భక్తితో వేడుచున్నదాన.

## ౨

[శ్రీ రవీంద్ర సారస్వతసమాజమువారిచే పోటీపరీక్షలందు యీ వ్యాసము ద్వితీయముగా నిర్ణయింపబడి రజితపాత్ర యొసంగబడినది.]

* శ్రీమతి *
వేమరాజు సుశీలగారు

నాటికి నేడు నెలలైనది. సంధ్యాసమయము. దుఃఖభూయిష్టమైన ప్రపంచమందు విసుగుజనించి సూర్యభగవానుడు అరుణలోచనుడై చూచుచుండెను. ఆ కోపదృష్టులలోనే విచారరేఖలవలె నల్లనినీడలు వ్యాపించుచున్నవి.

ప్రదేశము స్మశానవాటిక—ఒక స్త్రీమూర్తి నిశ్చలదృక్కులతో నెదుటనున్న సమాధివైపు చూచుచుండెను. ఆమెలో చంచలనములేదు. కొంతసేపటికి ఒక్క దీర్ఘనిశ్వాసము వదలి కొద్దిగా కదలినది. కన్నీళ్లతో వక్షము తడసిపోయినది. బాహ్యమంతయూ ప్రశాంతమే—కాని లోపల ప్రచండమైన విషాదాగ్నిజ్వాల. దేహమంతయు వణకిపోవుచున్నను ఆ వణకుచేతులతోనే సమాధిపైనున్న అక్షరములను కన్నీళ్లతో నెమ్మదిగాకడగినది. ప్రక్కనున్న పుష్పమాలికతో సమాధినలంకరించి ముందు మోకరించినది.

వెఱ్ఱితల్లీ! ఆతడు దేశస్వాతంత్ర్యముకొఱకు దరిద్రనారాయణసేవకొఱకు, ప్రాణమును బలిగా దానమిచ్చిన కర్మవీరుడు. అశాశ్వతమగు యీ జీవితమునకై యేలవిలపించెదవని జ్ఞానబోధ చేయుచున్నది; ధవళాంబరియగు సమాధి. ఆమె తనూలతకంపించుచుండ ఆసమాధిని బాహువులతో పెనవైచి గట్టిగా కౌగిలించుకొన్నది. ఒకక్షణము అనిర్వాచ్యమగు సంతృప్తి. మరుక్షణమే ప్రబోధముకల్గినది. ఎదుట స్ఫటిక చంద్రశిలానిర్మితమైన సమాధి నిర్వికారముగ నేయున్నది — ఆమెయుత్తేజితమైపోయినది- ఆక్షణమందే తన భావిజీవిత కర్తవ్యము అంతయు ఒక్కసారి మెరసినది. మరల ప్రియునిసమాధి ముందు మోకరించి అదృశ్యమైనది—ఆమె నేడు దేశసేవిక—ఆమెయే పతివ్రత.

యుగయుగములకును, మానవజీవితములకు వర్తించు ధర్మసూత్రము లొక్కటే. అట్టి ధర్మసూత్రములు సృష్టితోనే జన్మించి, సృష్టితోనే అంతమొందును. కాని కాలమునుసరించి బాహ్యస్వరూపము మారుచుండును — హృదయము పరివర్తనమందినప్పుడు



శ్రీమతి ముడుంబి లక్ష్మీదేవిగారు
శ్రీ చెల్లాయమ్మ స్మారక చిహ్న
వ్యాసరచన పోటీపరీక్షయందు
ప్రథమ బహుమతినందిరి.







శ్రీమతి వేమరాజు సుశీలగారు
శ్రీ చెల్లాయమ్మ స్మారక చిహ్న
వ్యాసరచన పోటీపరీక్షయందు
ద్వితీయ బహుమతినందిరి.

బాహ్యజీవితమును దానికి అనువుగా నిర్మించుకొననిచో సంస్కరణము అసంభవము. దీనికి యుదాహరణము హరిజనదేవాలయప్రవేశమే. అటులనే నేడు స్త్రీకి, అందులో భరతమాతపుత్రికకు పతివ్రతామతల్లులగు సీతా ద్రౌపదులే ఆదర్శములు–సీత ముగ్ధనాయిక, ద్రౌపది ప్రౌఢనాయిక. వారిని దృష్టియందుంచుకొనియే స్త్రీ తనజీవితనౌకను నిర్మించుకొనవలెను. నేటి స్త్రీ జానకివలె పతితో సహధర్మచారిణి కావలెను. ద్రౌపదిని మనసునందుంచుకొని పతితో రాజకీయరంగమునం దురుకవలెను. అప్పుడే స్త్రీ లోకమునకు యథార్థముగ తోడ్పడగలదు.

పతివ్రతయగు స్త్రీజీవితము మూడుభాగములుగా జేయవచ్చును. ఆత్మోన్నతి, ఆశ్రమధర్మనిర్వహణము, దేశసేవ అను మూడువిషయములందే స్త్రీ జీవితము బద్ధమైయుండును; అని నా అభిప్రాయము. పతివ్రతయగు స్త్రీ ఆత్మోన్నతిగల స్త్రీ. ఆమె జీవితమందు యెట్టి ఘట్టమునందైనను తన తనువుయొక్క జీవితస్వాతంత్ర్యమును కోలుపోదు. ఆమెచేయు పతిసేవ బానిసత్వముగాక యదార్థత్యాగము – ప్రేమప్రవాహము – ఆమె సూర్యునితో కూడియుండు ఛాయకాదు. స్వయంప్రకాశమగు తార. కావున పతివ్రతయగు స్త్రీ నిరంతరము ఆదర్శప్రాయులగు యువతీయువకుల చరిత్రలు చదువును. వారి యాదర్శములను తనజీవితమందు ప్రవేశపెట్టుకొనుటకు చేయు కృషియే ఆత్మోన్నతియగును. ఒకవ్యక్తి ఒకఆదర్శము నెంతవరకు సాధించెననుటకంటె అట్లు సాధించుటకు అతడు యెంతకృషిచేసెనో గుర్తించుట ముఖ్యము– కావున అట్టి నిరంతరకృషి స్త్రీకి జీవితమందు యదార్థసహనము, ఉత్సాహము, పట్టుదల యొసగును. అట్టి ఆత్మోన్నతిగల స్త్రీ లోకమున కెట్లుపకరించును? మానవహృదయములోనున్న మహోత్కృష్టమగు జీవశక్తులను విజృంభింపజేయుటకు మహోదారులయొక్క ఆత్మోన్నతి పొంగిపొరలి పాపములను హోమము చేయుటకు పతివ్రతచేయగల మహోత్కృష్టమైన మానవసేవ యదియే.

స్త్రీజీవితమందలి మరియొక ప్రకరణము ఆశ్రమధర్మనిర్వహణము. ఇదియే కష్టతరమగు సమస్య. ప్రాచీనభారతీయులు ప్రత్యేకస్వార్థముల నణచి విశాలతరమగు ఆదర్శమునకు పాటుపడుటయే వివాహముయొక్క ముఖ్యోద్దేశ్యమని తలచిరి. పురుషుడు లౌకికవ్యాపారనిమగ్నుడు. స్త్రీ ఆత్మనిగ్రహమందును, త్యాగశీలమునందును గొప్పది. ప్రాచీనులు ఉత్తమకాంతలకు "కార్యేషుమంత్రి కరణేషుదాసీ, శయనేషురంభా" లక్షణములు చెప్పియుండిరి. పతి కుంటియైనను, గుడ్డియైనను, రోగపీడితుడైనను, సిద్ధివినాయకుడైనను, స్త్రీ దైవసమానుడుగా చూచికొనవలెను. గాంధారి, నర్మద మొదలగు మహాపతివ్రతలే యిందుకు తార్కాణము. కాని ఒక్కక్షణము కన్నులుమూసికొని, ఆస్వరూపములను మరచి, వారిని బంధించు ధర్మసూత్రమును గ్రహింపవలెను. పతియొక్క సుఖదుఃఖానుభవములలో తానుగూడ బాధ్యతవహింపవలెను. ఎంతవరకనునది వ్యక్తులయొక్క శక్త్యానుసారముగానుండును. ఇదియే పతివ్రతయగు స్త్రీ నేడు ప్రాచీనులనుండి నేర్చుకొనవలసిన ధర్మసూత్రమని నాబుద్ధికి తట్టుచున్నది. పతి వీధిలో ధనమదాంధుల రాక్షసకృత్యములతో మోసగాండ్రయొక్క దుర్మార్గములతో, దీనులయొక్క మొఱలతో హృదయముకస్సి ప్రాణము విసుగు జనించి యింటియందడుగుపెట్టినవెంటనే పతివ్రత అతనిపైన మృతబిందువులు వర్షించి, హృదయతాపమును తీర్పగలశక్తిమతి. ప్రచండాగ్నిచే దహించు మానసికవేదనను ప్రశాంతసుధారసముతో చల్లార్పుటయే పతివ్రతయొనర్పగల సేవ. పతికి నూతనోత్సాహము, త్యాగశక్తి, ధైర్యము బోధించి వానిచేత తన ఆదర్శములను ఆచరణమందు పెట్టించుచు పరోక్షముగా లోకసేవ యొనర్చుచుండును.

స్త్రీ వీరమాత. లోకారాధనతత్పరులగు బిడ్డలను గనుట పతివ్రతయగు స్త్రీధర్మము. క్రీస్తు, బుద్ధుడు, శివాజీ, గాంధీ మొదలగు లోకోద్ధారకులు, దేశసేవాతత్పరులు, అకలంకచరిత్రులగు పతివ్రతామతల్లుల గర్భములందే జన్మించిరి. మహాపురుషులజీవితములలో చిన్నతనమందు జనని శిక్షణమున్నట్లు కాన్పించును. పతివ్రతయగు స్త్రీ మాతృప్రేమ సహాయమున బిడ్డలను వీరమూర్తులుగా చేయును.

పతివ్రతజీవితమందు మూడవవిషయము దేశసేవ. దేశకాలపరిస్థితులననుసరించి నేడు స్త్రీ తనజీవితకర్తవ్యము నిర్ణయించుకొనవలెను. సాంఘిక, నైతిక, రాజకీయసేవలలో మొదటి రెండింటినీ అవలంబించుటుచితమని నేను భావింతును. కాని సాంఘిక, నైతిక, రాజకీయములకు అవినాభావముండునని తోచుచున్నది. అంతయు పరిస్థితులపై ఆధారపడియుండును. నేడు స్పెయినుదేశములో జరుగుచున్న మహాయుద్ధమునందు యెందరు నారీమణులు తుపాకిగుండ్ల కాహుతి అగుచున్నారో తలచుకొన్నయెడల గుండె పగిలిపోవును.

స్త్రీ సహజముగా భీరురాలు. చిన్నకప్పపిల్లను చూచిన భయపడునట్టి స్వభావముగలది. కాని ప్రియునికొరకు ప్రేమబాహువులమధ్య నిదురించుచున్న ముద్దుబిడ్డకొరకు తాను ప్రేమించిన దేశముకొరకు భయంకరవ్యాఘ్రమువలె పోరాడగలదు. యేబాహువులు ప్రియునికంఠమును పెనవేసుకొని సౌఖ్యానుభూతిలో తన్మయము చెందునో, ఆబాహువులే యుద్ధరంగములో కంకాళముల మధ్యస్వైరవిహారము చేయుటకు జంకవు. అభినవభారతదేశమునందు పతివ్రతకర్తవ్యమేమి? నేడు భారతీయులు శాంతియుతమగు కర్మవీరులు. కావున స్త్రీ యాదర్శము సాంఘిక నైతిక సేవయే. అజ్ఞానులగు కోటానుకోట్ల దేశీయులను రక్షించి, భావదాస్యమును బానిసత్వము రూపుమాపుటయే నేడు పతివ్రత లోకమునకు చేయగల మహోపకారము. పతివ్రతయగు స్త్రీ యెచ్చట అడుగుపెట్టునో అదియే శాంతినిలయమే. ఆమె దారిద్ర్యమనుభవించుచున్నను మిణుగురుపురుగు యొక్క మిణుకే ఆమె యింటియందు దీపమైనను, ఆమె కోటానుకోట్లగు అనాథులకు వెలుగును.



# కావలెను

ప్రకృతము సౌభాగ్యనికేతనమున ముప్వరు బాలవితంతువులకు ఉచిత వసతికి వీలున్నది. కావలసినవారు దరఖాస్తులను పంపుకొనవచ్చును.

మా కార్యక్రమమును ప్రచారముచేయు స్త్రీలుకావలయును. ప్రయాణ ఖర్చులుమాత్ర మివ్వబడును.

మదరాసు జార్జిటవునులో 28 పవరిముత్తువీధిలో స్థాపింపబోవు మానికేతన బ్రాంచికి మా యుద్యమమందు సానుభూతిగల సంరక్షకురాలు కావలెను.

వివరములకు:

మంచికంటి వెంకటరత్నమ్మ
సంరక్షకురాలు
సౌభాగ్యనికేతనము, కాకినాడ.

# స్త్రీ యబలయా?

"వయసుతో దను బనిలేదు, వనిత పురుషుం
డను వివేచనయుండ దావంతయేని,
జాతిభేద మక్కరలేదు, సరసగుణము
లెందుగల్గునొ యది పూజ్యమెల్లయెడల."

భారతశాసన సభ్యత్వమునకు స్త్రీలు పెక్కండ్రెన్నుకొనబడుటకు సంతసించుటకు బదులు కొంతమంది పురుషులు తమ సంకుచితాభిప్రాయముల వెల్లడించుట గాంచుచున్నాము. భరతమాతకు తన సంతతియందలి స్త్రీపురుషు లిర్వురును సమానాభివృద్ధికి వచ్చి తా నౌన్నత్యమునుబొందుటయే యభిలాష. సంతానములో నొకరిపై నొకరి కనూయయుండదుగద. మాతకుమాత్ర మందరును సమానమే. పురాతనమునుండియు స్త్రీసామర్థ్యము లోకమెరుంగనిగాదు. స్త్రీలు రాజకీయములందు పాల్గొనుట కిది క్రొత్తకాదు. వారు నిజముగా 'సబలు'లయ్యు వినయసంపత్తివననుసరించి 'యబల'లుగా పరిగణింపబడుచుండిరి. ఈక్రింది విషయములు పాఠకలోకమునకు దెలియనివి కాకపోయినను మరల నొకసారి విశదీకరించుటవలన పునరుక్తిదోషము రాదనియు, అనవసరముగదనియు నా నమ్మకము.

కె. ఎం.

కుతర్కంబులకు దిగక సమదృష్టిం బరికించిన ప్రపంచమున స్త్రీయౌన్నత్యమెంతయు వర్ణనాతీతము. స్త్రీ సామర్థ్యము కడుంగడు శ్లాఘనీయము. సృష్టికాధార భూతమగు మహాశక్తి స్వరూపము స్త్రీయే. విద్యాధనస్వరూపములగు శారదాలక్ష్ములు స్త్రీలు. సమస్త జంతుజాలమునకు నిలువనీడ, తినుతిండి నిచ్చుచున్న భూమి 'భూదేవి'యని స్త్రీగా పరిగణింపబడుచున్నది. వేయేల! సమస్తమునకు నాధారము స్త్రీయే. ఆమెయే సర్వసమర్థురాలు. ఎట్లు? ఈక్రింది విషయముల బరికింపుడు.

## పరిపాలన

భరతఖండమును పరిపాలించిన పెక్కు రాణుల చరిత్రల పరికింప స్త్రీకిగల పరిపాలనా కౌశలము వెల్లడికాగలదు. రాణులగు అహల్యాబాయి, దుర్గాబాయి, తారాబాయి, రుద్రమదేవి మున్నగువారల శక్తిసామర్థ్యంబులు పెక్కురాజుల శక్తులను మించియుండె. స్త్రీలయ్యు తిరుగుబాటుదారులను, బందిపోటు గుంపులను నణచుటయందును, దాడిసల్పెడి పరరాజుల నరికట్టుటయందును, ప్రజలసౌఖ్యంబుల గాపాడుటయందును వారు జూపిన నిపుణత మెండు. స్త్రీయగు విక్టోరియా మహారాణి హిందూదేశపు ప్రజలలోను, స్వదేశప్రభువులలోనుగల నసంతుష్టిని తొలగించదలంచి యొసంగిన అభయపత్రమువలననే శాంతివాతావరణ మెల్లెడల వ్యాపించెను. ఆమె ప్రేమ, ప్రజానురాగము,

భగవద్భక్తి లోకవిదితము. ఆమెనాటిన విత్తుమూలముననే, ఆమెయొసంగిన యభయప్రదానుసారముననే ప్రభుత్వమువారు ప్రజాక్షేమమున కనుగుణముగ పరిపాలన చేయవలసివచ్చుచుండెను. ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వమున కవకాశ మొసంగవలసివచ్చెను.

### శౌర్యము

శత్రుసేనలకు వెన్నిచ్చి పారుచున్న సమయమున ధైర్యమును బురిగొల్పి, కత్తిని జండాను చేకొని, వీరత్వమునుబూని, శత్రులనెదిర్చి, విజయలక్ష్మిని జేకొని, దేశరక్షణమును గావించుకొనగలిగిన యబల 'జోన్‌కన్య' (Joan of Arc). మన భరతదేశమున వీరత్వము, రణకౌశలము, మంత్రాంగములు జరుపగలిగిన స్త్రీల బెక్కుర గాంచగలిగియుంటిమి. యుద్ధమున నపజయమంది యింటికి పారివచ్చిన ఖడ్గతిక్కన్నకు నులకమంచముచాటున, పసుపుముద్ద, ఉష్ణోదకముల స్నానమునకై నుంచి, మరల పౌరుషము నుద్బోధించి రణమునకు పంపగలిగిన దెవరు? స్త్రీ. రాణీ భవానీదేవి, ఝాన్సీరాణి మున్నగు పెక్కువీర వనితల చరిత్ర లెరుగనివికావు. యవనరాజ్యపాలనాసమయమున నెందరు క్షత్రియనారీశిరోమణులు కత్తులజేబూని శాత్రవుల మారణ మొనరించలేదు. జోద్‌పూర్ సమస్థానాధీశ్వరుడగు యశవంతుని భార్యయగు వీరమాత ఒకానొక సమయంబున నడుముకు ధట్టిని బిగించి, ఏడ్చుచున్న బాలికను వీపుపై బంధించుకొని, నరకాసురుని వధింప నరుగు సత్యభామవలె, మహిషదానవుం బరిమార్పనరుగు మహాశక్తివలె కటిచేలమును బిగించి, భీషణకరవాలముం ధరించి, తండోపతండములుగా ముందువచ్చి పడుచుండిన యవనభటులనేటుకు నూర్వురి శిరంబుల నేలదొర్లునట్లు కదనమొనరింపగలిగె.

### మానవసేవ, దేశసేవ

మహారణరంగమధ్యమున గాయపీడితులై, నిస్సహాయులైయున్న వీరభటసముదాయమునకు రాత్రింబవళ్లు, తన చిన్నిలాంతరు చేబూని, ప్రేమపూర్వక వాక్కులచే నలరించి, గాయములకడిగి, ఉపచారముచేసి, పెక్కుజీవముల గాపాడగలిగినది స్త్రీ (Florence Nightingale). ప్రస్తుతభారతీయౌన్నత్యమును దేశదేశముల జాటగలిగిన సరోజినీదేవి, సంఘసంస్కరణలకు పాటుపడుచున్న శ్రీమతి ముత్తులక్ష్మమ్మ, ఆచంట రుక్మిణమ్మగార్ల నెరుంగనివారులేరు. దేశసేవకై ముందంజవేసి కాంగ్రెసున పాటుబడుచున్న స్త్రీల బెక్కుర గాంచుచున్నాము. నేటి శాసనసభా మెన్నికలలో నుత్తీర్ణులై ఎందరు స్త్రీలు సంఘసంస్కరణ కంకణములు బూనుటలేదు!

### విద్వత్తు, కవితావిషయములు

చిన్ననాటనే శ్రీరామానుగ్రహముంబడసి, రామాయణగ్రంథమును మృదుమధురశైలి పద్యకావ్యమున రచించి పరలోక

గతురాలయ్యు మృతజీవినియై నేటికిని మన్ననల గాంచుచున్న మొల్ల, జీవయాత్రాది గ్రంథముల రచించి కేసరీపతాకాదులచే బహూకరించబడుచున్న విద్వాన్ కవితిలక, కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు మున్నగు స్త్రీరత్నములు పెక్కురుగలరు.

### క్షమ

ఓర్పున స్త్రీకి సాటి యెవ్వరును లేరు. మున్నంగి లక్ష్మీనృసింహ శర్మగారి యీ క్రింది పద్యమును దిలకింపుడు.

"కాఁపురము చెట్టునీడ; మగండురోగి;
పాలుచేపమిఁ బోరిడు పాపచంక;
కూటికోర కడపిల్లల గొల్లువెంట;
నెత్తిపైప్రొద్దు; నడివీధి; ఉత్తజోల;
పస్తు; వ్రేఁకటి; సాగదుబాట;—దవ్వు;
వాడవారలకసరులు; పేడియూర్పు;—
పెట్టిపుట్టని బ్రతుకని పెదవులార్తు;
బుజ్జగింపుల బుడుతల బొజ్జనింతు;
వాకిలరఁజూప; వింతచిరాకుపడవు!—
పేదరిక మెంతయోర్పు నేర్పినది తల్లి!"

గృహనిర్వహణంబున స్త్రీకిగల యోర్పు అసామాన్యము.

### భక్తి, జ్ఞాన, వైరాగ్యంబులు

ప్రస్తుతప్రపంచమున నివి యెచటనైన గాంచగలిగినచో నవి విరివిగా స్త్రీలయందు మాత్రమే యున్నవనుటయం దెంతమాత్రమును నతిశయోక్తిగలేదు.

### పరిశ్రమలు, కర్షకవృత్తులు

ఈవిషయమున ప్రపంచమునందు స్త్రీల సహాయ మింతయో లోకవిదితమే! పాశ్చాత్యదేశములనేమి, భారతదేశములనేమి పరిశ్రమలు, చేతిపనులు పెక్కింటియందు స్త్రీలెందరు పాల్గొనుటలేదు? విద్యుత్శాలలు, పింగాణీ పరిశ్రమలు, నేతపరిశ్రమలు, సబ్బులు మున్నగు యంత్రశాలలందును, ధాన్యపు మరలందును స్త్రీలు జూపుచున్న శక్తిసామర్థ్యంబు లక్కజములు. వేయేల! 'కార్యేషుదాసీ, కరణేషుమంత్రి' మున్నగు స్త్రీ సామర్థ్యంబులు లోకమెఱుంగనివి గావు. కనకాంబగారు వ్రాసిన యీపద్యమును జూడుడు.

"ఉ॥ రాజ్యములేలినారు, రణ
రంగములన్ రిపుదోలినారు, సం
పూజ్యతనొందివారలు,
ప్రబుద్ధులలో జయమొందినా రహో!
భోజ్యమునర్చినారు, తప
ముంబొనరింపగ నేర్చినారు, సా
మ్రాజ్యపదంబె కాంతలకు
ప్రాజ్యమగున్గద భారతావనిన్."

ఇట్లు సర్వసమర్థురాలును, సమస్తబల సమన్వితయునగు స్త్రీ 'సబల' యయ్యు సవినయంబున నబలగా పరిగణింపబడి నెంతయు వన్నెకెక్కియున్నది. ఆమె 'కంచు'గాదు. 'కనకము'. ఇది స్త్రీజాతి యొక్క వినయలక్షణము.

## స్త్రీ యబలయా?

భరతఖండము అశోక, శ్రీహర్షాది చక్రవర్తులు, శివాజీ, పృథ్వీరాజు, ప్రతాపసింహాది మహావీరులు, బుద్ధ, మహావీర, శంకర, రామానుజాది మతగురువులు, రామదాసు, కబీరు, చైతన్యాది భక్తశిఖామణులు, భాస్కర, వరాహమిహిరాది మహాశాస్త్రజ్ఞులు, చాణుక్య, యుగంధర, తిమ్మరుసాది మహామంత్రులు, వాల్మీకి, కాళిదాసు, పోతనాది మహాకవులు, రుద్రమదేవి, అహల్యాబాయి, తారాబాయి మున్నగు మహారాణులు, గాంధి, మాలవ్యా, జవహరిలాల్ నెహ్రూలవంటి కార్యధురంధరులు గలిగి, సర్వబలసమన్వితమై, సర్వసంపదలఖనియై, సమస్త పంటల కాలవాలమై, 'సబల'యయ్యు, 'భరతమాత' యని 'అబల'గా సంబోధింపబడుట లేదె! ఆహా! స్త్రీయౌదార్య మెంతయు వర్ణనాతీతము.

ఇట్టి బుద్ధికుశలతలు స్త్రీలయందు సహజలక్షణములు. వారి మనోవికాసముల పెంపొందింప నెక్కువ యవకాశముల గల్పించి, వారి నెక్కువ విద్యావంతులుగ జేసినచో 'పసిడికిని దావియబ్బినభాతి' యగును. భారతదేశ మెక్కువ యౌన్నత్యమునకు వచ్చును.

కె. ఎం.

---

# వ్యాసకర్తలకు

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచెము మార్జినువదలి కాగితమున కొకప్రక్కమాత్రమే సిరాతో విడివిడిగా వ్రాయవలెను. వ్యాసములనుగూర్చి ఉత్తరప్రత్యుత్తరములు గోరువారు రిప్లైకార్డు వ్రాయవలయును.

వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలను పంపవలయును.

వ్రాయు ప్రతిలేఖయందును పూర్తిచిరునామా వ్రాయవలయును.

వ్యాసములు వ్యావహారికము లేక గ్రాంథికభాషయందుండవచ్చును. రెండింటినికలిపి వ్రాసిన అంగీకరింపబడవు.

సంపాదకుడు.

శిశుపోషణ

# చక్కనిగది

# చంటిబిడ్డల కారోగ్యం

ఎస్. శేషగిరిరావుగారు.

శిశువునకు ప్రత్యేకముగ ఒకగది ఉండవలెను. అది శుభ్రముగ, విశాలముగ, అందముగ ఉండవలెను. వెలుతురు గాలి చక్కగా వచ్చుచుండవలెను. మురికిగుంటలు, దొడ్లు దగ్గరగ ఉండకూడదు. అనవసరమగు సామానులు గదిలో ఉండరాదు. చెడుగాలి అనారోగ్యమునకు నీరసమునకు కారణము. గోడలపై కర్టన్లు (Curtains) వుంచరాదు. వెలుతురనిన బలమైన వెలుతురు కాదు; అది కండ్లకు తగిలిన నిద్రరాదు. కండ్లు చెడును. * *

కలకల ధ్వనిగలవి, అందమైనవి, తేలికైనవి, పదునైన అంచులు లేనివి, ఆవు, గుర్రము మొదలగు జంతువుల ఆకారములు కలవి పండ్లువలె నుండునవియునగు, లక్క ఆటవస్తువులను ఇవ్వవలయును. ఏవస్తువు అయినా నోటిలో పెట్టుకొనుట పిల్లలకు సహజము.



జాగ్రతనేర్పక, దాచి, మాయమయినదని, తాకిన నెవరో కొట్టుదురని, యనుట క్రమమగు శిక్షణ కాదు.



పిల్లలు ఊరక ఉండరు. వాళ్లుచేయు పనులనుగమనించి సరియైన శిక్షణ ఇవ్వడము అవసరము.

భయపెట్టక నమ్మకము కల్గించవలెను - భయపెట్టుట పిల్లలకు పిరికిమందు పోయుటయే.

మిట్టపల్లములు, రాళ్లు, ఇసుక లేనిచోట పిల్లలను ఆడుకొననీయవలెను. ఆడుకొనుటకు రంగురంగులవి, అందున ప్రమాదములు జరుగకుండుటకై మ్రింగుడు బడని ఆటవస్తువులనే పిల్లలకిచ్చుట మంచిది.

# బిడ్డలు ఎందుకు ఏడుస్తారు ?

ఆకలిఅయి
ఆహారము సరియైనది కాక
దాహమై
ఎండవేళలలో వెలుతురుకు ఆగలేక
బట్టలు తడిసి,
చాలక,
బిగువై
ఏవో గుచ్చుకొని
ఏవో కుట్టి
విరేచనము కాక
కడుపు నొప్పివచ్చి
చికాకుగావుండి
బిడ్డలు యేడుస్తారు.

నొప్పిగల చోటును ఇతరులు తాకిన శిశువు ఏడ్చును.

శిరోరోగమయినశిశువు కండ్లుమూసుకొని తల యెత్తక యుండును.

శరీరమంతా బాధగాయున్న ఏడ్పు చాల హెచ్చుగ నుండును.



సముద్రస్నానము, సముద్రపుగాలి బిడ్డలకు ఉత్సాహము కలుగజేస్తవి.

*　　*　　*

5-6 నిమిషములకన్న ఎక్కువకాలము బిడ్డలకు సముద్రస్నానము కూడదు.

*　　*　　*

స్నానములేనిబిడ్డలు బలహీనులు, వ్యాధిపీడితులు, అందవిహీనులు.

*　　*　　*

బిడ్డలకు ఉదయస్నానము ఆరోగ్యము కల్గించును. ఆకలిని పుట్టించును.

*　　*　　*

బలహీనులగు బిడ్డలకు భోజనముఅయిన 2-3 గంటలకు స్నానము చేయించుట మంచిది.

# ఆంధ్రనారీమణులకు కొన్ని సలహాలు*

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

పదిసంవత్సరములుగా "ఆంధ్రరాష్ట్రీయ మహిళా సమావేశము ఏటేట నొక్కొక్క ముఖ్యపట్టణమున జరుపుచుండుట యెల్లరకును తెలిసిన యంశమే. కాని అంతకంటెను అందుబాటుగా స్త్రీలకు ప్రబోధము జరుపవలెనన్న తాలూకామహిళాసభలుకూడ జరుపుచుండినయెడల మరింతమందికి విజ్ఞానాభివృద్ధికరము.

అఖిలభారత మహిళా తీర్మానములు భారతదేశ స్త్రీల మొత్తమున కుపకరించును. కాని వివిధాచార భూయిష్టమై, పలువిధ భాషలకు నెలవైన భారతదేశమున కంగమగు హిందూదేశమున పలురాష్ట్రములు కలవు. రాష్ట్రీయభాషలు, వేర్వేరగుటచే నొక మహాదేశ సమావేశముచే, ఎల్ల మహిళాశయములును నెరవేరవు. రాజకీయ హూణభాషాఏకత్వసౌకర్య మున్నను, నూటికే యిద్దరికో కాని ఇంగ్లీషు భాషాజ్ఞానము లేదు. అందుచే మహిళాలోక మాలోచించి, ఏయేరాష్ట్రములవారి కాయారాష్ట్రముల నేటేట మహిళాసమావేశము లొనరించుకొని, తమకు కావలసిన హక్కులు, సాంఘిక దిద్దుబాట్లను, తెలియజేయు నివేదికలను తయారుచేసికొని, వాటిని తీర్మానించు ద్వార నఖిలభారత మహిళాసభవారిపై బెట్టుచుండిరి.

వారందరి విషయముల చర్చించి, తమకు కావలసిన అభ్యున్నతికి దగిన సౌకర్యములను, ఇతర దేశముల చేర్పును, నివేదించుచు శాసనసభలలో ఎసంబ్లీ మెంబర్ల ద్వారా అమోదాధికారముల బడయ ప్రయత్నించుచుండిరి.

అట్టి మొత్తముగాకూడిన పెద్దసభలకు, దూర సభలకును, ప్రవేశ మందరి స్త్రీలకును కలుగుట దుర్లభము. పైగా భాషాభేదములచే తర్జుమాల కష్టములుకూడా కలుగుచున్నవి. అందుచే మహిళాలోక మాలోచించి, రాష్ట్రీయ, జిల్లా, తాలూకా గ్రామసమావేశములుగా, స్త్రీలోకమున కధిక విజ్ఞాన వ్యాప్తి జేయ నెంచిన అంతర్జాతీయలక్ష్యము మహిళా సభల ముఖ్యోద్దేశము. ఇదెంతటి సదుద్దేశమై యున్నది! రాష్ట్రమొత్తమున కొక్కసభజరిపిన నాడు కంటె, రాష్ట్రమందుండెడి యనేకజిల్లాలలో జిల్లా కొక్క మీటింగు జరిపినయెడల యెన్నిరెట్ల మహిళాభ్యుదయమగును. దానికితోడు ఒక్కొక్కజిల్లా కెన్ని తాలూకాలుండును. అట్టితాలూకా కొక్కొక్కసభ జరిపినయెడల తద్వారా యెంతటి విజ్ఞానవ్యాప్తియో యోచింపుడు.

తరువాత, ఎంతసేపును పట్టణములనే పట్టుకు ప్రాకులాడుచుండినయెడల, గ్రామకాంతల గతి యేమి? వారిమూఢ్యాంధకార మెట్లు తొలగించుకొని బాగుపడగలరు? అనాదిగా స్త్రీల మీటింగులే హాస్యాస్పదమై నవనాగరికయుగమగు నీయిరువదవ శతాబ్దములో నింతవరకు నిరసనామోదములమధ్య కొట్టుకొనుచున్న స్త్రీలోకములో, గ్రామీణుల సనాతనాచారమూఢ్య మింకను తొలగలేదు. స్వసౌకర్యములయెడ వారందరికంటె వెనుకబడియేయుండిరి. నూతిలోనికప్ప జీవిత మనుకరించుచు, స్వగ్రామమందే అణగియుండి, వీధిమొగము నెరుగని గ్రామకాంతలు, పట్టణసభలకు బోదురా! తమ కేవిషయములు లోపించినవో, యెంతతక్కువ అసౌకర్యములమధ్య తాముండిరో యోచించుటకైనా విద్య యవసరము.

అసలు పట్టణములకే ఏకోస్తోకో కాని యున్నత స్త్రీ విద్యాలయములు లేవు. నిర్బంధ ప్రాథమిక బాలికాపాఠశాలలే కాని ప్రతిపట్టణమునకు సరియగు యుపయుక్తకర విద్యావిధానము బోధించు స్త్రీ విద్యాలయములే లేవు. అట్టిచో, నిర్జీవకరముగానున్న

* వేమగిరిలో జరిగిన రాజమహేంద్రవరము తాలూకా మహిళాసభాధ్యక్షోపన్యాసమునుండి.

పల్లెల ఒక్కొక ప్రాథమిక బాలికాపాఠశాలలైనను లేవు. అట్టి గ్రామవాసు లెంతటి వివేకవంతులుగా నుందురో ఊహ్యనీయము. స్త్రీపురుషుల కలయిక ప్రాథమిక పాఠశాలలోనుండును. అట్టి బాలబాలికల కలయికబడులకు తమ బిడ్డలను పంపుటకు భయాధిక పెద్దలు సంశయించి, బాలికకు 10 సంవత్సరములు రాగానే బడి మాన్పించెదరు. అంతటి చిన్న చదువులో స్వస్తిచెప్పిన బాలిక భావోన్నతి బడయ నేరక, పెద్దలాచారములనే అనువర్తించును. అట్టి బాలిక పెద్దదైనను స్త్రీబాధ్యత గుర్తెరిగి ధైర్యము వహించుటకు తగిన విద్యానుభవములేక ఇంటనే మ్రగ్గుచుండును. ఇట్లు ప్రతికుటుంబ స్త్రీలును అడకత్తెరలోని వక్కజీవిత మనుకరించుచుండగా, నిక మీటింగుల ముఖమెట్లు జూతురు.

ఇట్టి క్లిష్ట పరిస్థితు లాలోచించియే మహాత్మా గాంధీజీ నెహ్రూమహాశయులు మొదలగు మహాత్ములు పట్టణముల కాయువుపట్టులగు పల్లెల పునర్నిర్మాణమునకే దీక్షగొని శ్రమపడుచుండిరి. వారికి చేదోడు వాదోడుగా తమ సోదరీమణుల కష్టపరిహార దీక్షాకంకణ బద్ధులైయే యేటేటజరుపు సమావేశములన్నియు గ్రామాదులందేజరిపి తోడి స్త్రీలకు ధైర్యముగలిపి సౌకర్యమార్గములు చూపించి వారిచేతనే నిజసుఖమార్గములు తాలూకాబోర్డులకు నివేదించుకొను తీర్మానముల నేర్పును గ్రహించుకొనుశక్తిని గలుగజేయ సమకట్టుట కడు ప్రశంసనీయము.

ఇట్లుగా సంవత్సరమున కొకసారియో అర్ధసంవత్సరమున కొకసారియో, త్వరలో స్త్రీఅభ్యుదయము కావలెనన్న, మాసమున కొకసమావేశమో మనము జరిపించుకొనుచు అన్యాయాపరులగు పురుషులచే లక్కువగా చేయబడి స్త్రీజీవిత మన్నిటను నిరాదరణావమాన నిర్లక్ష్యభావముగా చూడబడుచు భగవంతునిచే స్త్రీలోకమున కొసగబడిన న్యాయమైన మనస్వంతహక్కులు కోల్పోయినవాటిని ప్రబోధావకాశములు లేక మానసికముగా దాగియుండిన సర్వశక్తులను అంతఃకరణశక్తిచే విజృంభింపజేసికొని పూర్వస్త్రీల నాదర్శపాత్రముగా స్ఫూర్తికి దెచ్చుకొనుచు తోడిసోదరులకు బోధించి మోదింపజేసి సంఘీభవించుకొని వ్యక్తిజీవిత స్వాతంత్ర్యముల నిలబెట్టుకొనుటకేగాక గ్రామకాంతల నజ్ఞానాంధకారమునుండి బయటకుదెచ్చి సంపూర్ణమహిళామహోదయమందుటకే గ్రామసభ అత్యవసరమని నాఅభిప్రాయము. స్త్రీలందరి భావములొకే యున్నతిని బడసినకాని కార్యానుకూలము సులభము కాదు. మనబోధన అరణ్యరోదనములగును.

## నేటి విద్యావిధానము

ప్రస్తుత విద్యయొక్క విలువ తెలిసియేయున్నది. మనకీ విద్య నిరుపయోగమగుటయేగాక, గర్వభూయిష్టతకలిగించి, తోడిజాతీయవిద్యమాత్రమే నెరిగిన తోడిసోదరులయెడ నాదరణభావమును, గృహకృత్యము లాచరించుటయం దభిమానముకలిగి, ముప్పు తెలిసికొనలేని యతిస్వేచ్ఛావాతావరణ విహరణాతిశయములచే నెందునకును బనికిరాక త్రిశంకుస్వర్గము ననుకరించుచున్నారు.

కాన సమావేశములలో ముఖ్యముగా స్త్రీలకు చెప్పు విద్య వేరుగా నిర్మించులాగున, నివేదికను తయారుచేయవలె. ఇల్లు శిశువు స్త్రీల హస్తగతమగుటచే స్త్రీవిధాయక కృత్యములగు నీ రెంటికిని నుపయోగించువిద్యనే మనము కోరవలెను.

చేతివిద్య నేర్చిన గృహిణి, అవకాశసమయమున వ్యర్థప్రసంగ కాలక్షేపము లొనరించక, కాలము విలువ నెఱిగి, అర్థమును వెచ్చించకుండనే, చిత్రలేఖనముచే గోడలలంకరించుకొనియు, అల్లికపనులచే పలుభిత్తికలు, (ద్వారబంధ తెరలు) కుర్చీలపైని బల్లలపైని వివిధ మృగ పక్షిలతాకుసుమముల డ్రాయింగుతోగల చాకము అల్లుకొనియు, పేము నేతచే కుర్చీలు, ఉయ్యెల

తొట్టెలు, పువ్వులసెజ్జలు, తమలపాకులపళ్లెములు మొదలగు చిత్రాలంకారములు బడయవచ్చును. ధనవంతులయిండ్లకవి అలంకారప్రాయములగును. ధనవిహీన సోదరీమణి కిట్టిచేతివిద్యలు, భర్తస్వల్పదాయమునకు చేదోడుగను, వితంతుసోదరిని, పీడనిబడనీయని స్వకాయకష్టార్జిత ధనసౌఖ్యములకొసగి, బ్రతుకు తెరువుగను నుండును.

లలితకళలలో గానవిద్య కలకంఠి బిరుదముగల కాంతలే నేర్వదగినకళ. అదియుగాక బీదసోదరికీ గానవిద్యచే, ద్రవ్యార్జన సాధకము, బాలికాపాఠశాలకు గానోపాధ్యాయినిగానో ఇతరులకు మాసవేతనగా జెప్పుకొను ఉదరపోషణకుగాను యుపయోగించును. వితంతువులై ఆస్తిహక్కులులేనివారి కిట్టి చేతివిద్యలు, గానకళలును, ఉదరపోషణకై పరుల పంచబడనీయకయు, వదినమరదండ్రచే పనులనియమింపజేసికొను హీనజీవితముగడుపు నిర్బంధ దుఃఖజీవితముడిపి ఆర్థికలాభము చేకూర్చును.

## చట్టములు

శారదాయాక్టు ఉండియు మొన్నటివరకు దొంగ వివాహములరీతిగాను, ఏ పల్లెటూళ్లనో చడీ చప్పుడులు గాకుండను శాస్త్రప్రకారములు విడిచియు, వరశీలరూపగుణవిచక్షణలు లేకుండను నతిక్రమవివాహములు కొన్నిచోట్లను జరుగుచునేయున్నవి. ప్రౌఢవివాహోమోదకులు యుక్తవయస్సు వచ్చువఱకును తమకన్యలను నిర్బంధవివాహములపాలు సేయక ఉభయోద్దిష్టవివాహము లొనరించుచునేయున్నారు. ఈ మధ్యను తిరిగి యుద్ధరించబడిన చట్టములో ఏనాం, మొదలగు, ఇతరరాజ్యపాలనా గ్రామాదులందుకూడ బాల్యవివాహములుచేయుట నిషేధింపబడెను. ఇప్పుడే శారదాయాక్టు పరిపూర్ణఫలితము పొందగలదు. బాల్యవివాహములవలన కుశాగ్రబుద్ధిగల్గిన బాలికయొక్క విద్యాసంస్థలు వెరవేరవు. పూర్తివికాసమందగలిగిన బాలికకు వివాహము చాలా యడ్డంకిగల్గించును. కాని, విద్యాగంధ మబ్బని బాలకు ప్రౌఢత్వము వఱకుంచిన సావకాశము స్వాతంత్ర్య మొండితనము గల్గించునేమో? అట్టిది చాలనరుదు. కావ కన్యాత్వమందే ఏయడ్డంకియునులేక విద్యసాగునట్లు వివాహానంతరము సాగదు పైగా ప్రౌఢబాలికావివాహమునకు డైవోర్సు(విడాకుల)చట్ట మవసరములేదేమో?

వితంతు బాలికలయెడలగూడ తలిదండ్రులు ముఖ్యముగా వారియుద్దేశములు గమనించుట శ్రేయము. స్వభావముగా ద్వితీయవివాహమాడ నిచ్ఛగించక మనోదిట్టముతో సత్కాలక్షేపమో, దేశసేవా భాగ్యమో, స్వాతంత్ర్యజీవనమో కోరువారు ఇహభోగవాంఛలనువీడి పరమేకాంక్షించువారిని వివాహమాడ నిర్బంధించ నవసరమేదు; కాని, దుర్బలులై వాంఛారతులగువారిని నిర్బంధవైధవ్య దుఃఖముల పాల్జేయువారి బాధ్యులను (గార్డియన్లు) శిక్షితచట్టములచే నిర్బంధించవలెను.

ఇక నొక ముఖ్యాంశము. భార్యావియోగులై ద్వితీయ, తృతీయ వివాహములాడ నిచ్ఛగించు పురుషులు, కన్యలనే పాణిగ్రహణము చేసికొనకుండ పతివిహీనులై యుక్తవయస్కులైయున్న బాలవితంతువుల నార్తిదీర్ప వారినే వివాహమాడు శాసనమొకటి అమలులోయుండవలెనని తీర్మానించుట విధాయకము.

హిందూస్త్రీల వారసత్వపుబిల్లును డా. దేశముఖుగారిచే శాసనసభయందు ప్రవేశపెట్టబడినను ఫలితమినుమంతయు లాభకారిగా నుండలేదు. సనాతనముగా మనస్త్రీల ఆర్థికలాభము లాలోచించిరే సాలంకృతకన్యాదానము చేసిన తండ్రిసొత్తును, స్థాలీపాకపముయుసప్తపది వేళ వత్తవారిచే నొసగబడిన సువర్ణాలంకారములును, స్త్రీధనముగా పరిగణింపబడి దానవిక్రయ సమస్త హక్కుభుక్తములు కలిగి యుండుట స్తుత్యనీయము.

స్త్రీల ఆర్థికస్థితి తొలగిననాడుకాని దేశ దారిద్ర్య దుఃఖము తొలగదు. స్త్రీ ధనవంతురాలగుచేని తోడి బీదసోదరులబాధలు నిర్వర్తింప వృత్తి సంస్థలు స్థాపించి, అందున కూలినిచ్చి, పరదేశములకు ప్రాకులాడవలసిన యవస్థలు తొలగించి, మనకు కావలసిన సబ్బులు, సెంట్లు, తలనూనెలు, పళ్ల పొడులు, రాట్నముల మీద దారముతీసి, మగ్గములపై, బట్టలు, మంచముపట్టెడలు, తువ్వాళ్లు, దుప్పట్లు వగైరాలు చేయించు సమస్త శిల్పకళా విద్యలను సాగించి, విదేశములకు వెళ్లు లాభములను మనమే స్వీకరించి, నిరుద్యోగసమస్యను పరిష్కార మొనర్పవచ్చును. ఇట్టివి యుదారధనవంతులగు పురుషులేచేసి, స్త్రీల నుద్ధరించిన మరింత సౌఖ్యకరము. స్వదేశవస్తుసంపాదనయు, విదేశవ్యామోహ విసర్జనయు కలిగిన ఆర్థికలాభ మొనకూడకలదు. ప్రత్తిపంట మనది. మన తెల్వితక్కువచే దానిమీద ఆదాయము పెరవారిది. తప్పుదంతయు మనది. ఒక రూపాయికి వందరూపాయిల విలువ సార్జించు బిస్కట్లుచేసి మనకే పంపి మనచేతనే తినిపించి, లాభమంతయు పొందు తెల్వి వారిది. కాన న్యాయముగా వారసత్వపుహక్కులు పొందువఱకు మనము పోరాడుచుండవలెను.

## గ్రామ సౌకర్యములు

పట్టణముల భుక్తిఅంతయు పల్లెలపై నాధారపడియున్నది. కాని వారి సౌకర్యములపట్లను, వారి పురపారిశుద్ధ్యములయందును, మనము ప్రయత్నించకుండుట కడుశోచనీయము. ప్రబోధములిచ్చుచు వారికి తగినవిద్య, ఆరోగ్య శిశురక్షణాలయములు, ప్రసూతి వైద్యాలయము, తెల్విగల మంత్రసానిని ముఖ్యముగా ప్రసాదింపవలెను. జనాభాలెక్కల లోని మరణపట్టికలలోని శిశుబాలెంత పాముకాటు మరణసంఖ్యలలో పల్లెలే యెక్కువమందిని పోగొట్టుకొనుచున్నవి.

## అస్పృశ్యత

అంటరానితన మను వర్ణ మసలే లేదు. కాని ఆర్యులాదిని, కుకర్ములయి హింస, త్రాగుడు, వ్యభిచారము చోరత్వము మొదలగు వ్యసనావలంబకులను సంఘదూరులుగా బహిష్కరించి నిరసించిరి. వారి వంశమే అంటరానిదిగా అమలులోబడి, సంఘబలమును పోగొట్టుకొనుచున్నది. దీనినిగురించి వారిబాధలు తొలగించుటనుగురించియు, మాహాత్మాజీ మొదలగువారెందరో ఎన్నిరీతుల బోధించుచున్నను మనచే మానహీనముగా చూడబడిన అవర్ణుల నాదరింప నిరుమతములు కాచుకొని ఆహ్వానించుచు, తమ మత ప్రబలమును, మన మతజీర్ణమును చేయుచున్నను, మూర్ఖపుటాచారములను మన మింకను వీడకుండ మున్నాము. స్త్రీలమే ముందంజవేయు పురుషుల నడ్డగించు బంధములమైయుండుట మనకే లోటు. కాలానుసారము ధర్మములు మారుట, అట్టి ధర్మనీతిరీత్యా ప్రజలు నడచుకొనుట శ్రేయస్కరము.

మన మెన్నిహక్కులు సంపాదించినప్పటికిని హిందూవనితలు, శీలవర్తనలు అన్న సనాతనఖ్యాతిని మాత్రము నిలబెట్టుకొనవలయును. కాని పురుషుల సంపూర్ణ స్వేచ్ఛాదుర్వ్యశము మాత్రము మనము కోరగూడదు. ఆ కోరికలో మాత్రము పురుషసమానత్వము మనకక్కరలేదు. "శీలవతి! మానవతి!! లజ్జావతి!!! యన్న స్త్రీ గౌరవపదమునకు నింద రాకూడదు. మాననీయురాలికుండు గౌరవపదము ఎంతటి యున్నతవిద్యాబిరుదములు పొందినను మానము మంట గలిపిన కాంత కలవడదు. ఇంతవరకును ఖండేతరులచే కూడ కీనుతింపబడుచుండిన గౌరవము హిందూదేశమునకు స్త్రీలవలననే యని నమ్ముడు.



# నీ చర్మ సౌందర్యమెంతో నీ వయస్సంత

క్రింది చర్మపు తైలగ్రంథులు పనిచేయునపుడే ముడుతలు గీతలు బైలుదేరును. పైచర్మము నశించి కఱకు దనము ప్రారంభించును. ఈ రెండు చర్మములను మంచి స్థితియందుంచుము.

గీతలు ముడుతలు: ప్రతిరాత్రి పాండ్స్ కోల్డ్ క్రీము పూసిన మానును. ఇది క్రిందిచర్మమునకు మంచి శక్తిని గొనిపోయి తైలగ్రంథులను కండరములను బలపరచును. ఇది రోమకూపముల శుద్ధిచేయుటవలన నల్లని మచ్చలు మాయును.

కఱకు చర్మము: పాండ్స్ వానిషింగ్ క్రీమును పూసిన మాయమగును. పాండ్స్ కోల్డ్ క్రీము ఉపయోగించిన తరువాత ముఖమునకు, మెడకు చేతులకుగూడ పాండ్స్ వానిషింగ్ క్రీము పూసి రాత్రంతయు నుండనిచ్చిన ఉదయమున చర్మము మృదువుగా నూతనముగా మనోహరముగనుండును.

ఉచితము: దీనిని నేడే పంపి పాండ్స్ రెండు క్రీములట్యూబులను పాండ్స్ ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్ ... ........రోజ్ క్రీమ్........బ్రునెట్.........

డాడ్జి అండ్ సెయ్మర్ లిమిటెడ్,
3, విటెట్ రోడ్డు, బొంబాయి.

పేరు....................................
చిరునామా.................... No. GL. 14.






మీ ఆరోగ్యము, శరీరచ్ఛాయ పెంపొందించుటకు మార్గోసబ్బుకన్న మేలేదియు లేదు. అందలి వేపనూనె చర్మమునకు మిక్కిలి మంచిది. దాని మృదువైన నురుగు పై చర్మమునే గాక చర్మ రంధ్రములనుగూడ శుభ్రపరచును.

# MARGO SOAP

మార్గోసబ్బును మీ కుటుంబపు సబ్బుగా చేయుడు. మీకు అపాయకరమగు అంటువ్యాధులేవియును రాకుండ కాపాడుటకు దీనికి సాటి మరేదిలేదు.

కలకత్తా కెమికల్స్

# నా దక్షిణ దేశ యాత్ర

పాలపర్తి రామమూర్తిగారు

రామేశ్వరము వెళ్లిన యాత్రికులు సేతుస్నానము చేయనిది తిరిగిరారు. రామేశ్వరమునుండి ధనుష్కోటికి 12 మైళ్లు. రామేశ్వరమునుండి పాంబను స్టేషనుకువచ్చి అక్కడనుండి ధనుష్కోడికి, రైలుమీద వెళ్లవలెను. ఈమార్గము యిసుకతిన్నెలతో నిండియుండును. రైలుపట్టాలకు యిరుప్రక్కల సముద్రము కనబడుతూనేవుండును. ధనుష్కోటి సౌతుఇండియన్ రైల్వేవారి దక్షిణకొనస్టేషను. దానిఅవతల సముద్రమే. సింహళమునకు (సిలోన్) పోవువారు ధనుష్కోటి స్టేషనులోదిగి సిలోనుకుబోవు స్టీమరునెక్కుదురు. రైలులోదిగిన ప్రయాణీకులు చిన్నపడవలనెక్కి స్టీమరువద్దకు సముద్రముమీద పోకుండ రైలే సముద్రములో కొంతదూరము వెళ్లును. ఈ రైలు మార్గము ఒకవంతెనగా నిర్మింపబడినది. దీనికే పీరు అందురు. రైలు యీపీరుమీద నిలచును. స్టీమరునుసరిగ యీపీరుఆనుకొని నిలుచును. ప్రయాణీకులు స్టీమరులో నెక్కుటకొరక వెడల్పాటి చెక్కవేతురు. సిలోనునుండి వచ్చినవారు స్టీమరుదిగి రైలు ఎక్కుదురు. సిలోనుబోవువారు రైలుదిగి స్టీమరుఎక్కుదరు. ఇదేవిధముగ సామానులును మార్చబడును. ఈ స్టీమరు సైతము ఎస్.ఐ.ఆర్ కంపెనీవారిదే. రైలుస్టేషను యీ స్టీమరునిలుచు పీరుభాగమునకును కొంతదూరముండును.

## సేతువు

సేతుస్నానము చేయదలచినవారు రైలు దిగి సముద్రపు ఒడ్డుననే నడచిపోవుదురు. ఈమార్గము కేవలము సైకితప్రదేశము. కాళ్లు యిసుకలో కూరుకొనిపోవుచుండును. ఇక్కడనుంచి రెండడ్లబండ్లు సయితము పోవును. ఇసుకలో యీ బండెక్కిపోవుటకన్న సముద్రముయొక్క చల్లనిగాలిలో వేలకొలది ప్రయాణీకులతో గుంపులు గుంపులుగా చేరి కబుర్లు చెప్పుకొనుచు కాలినడకన వెళ్లుటే చాల మనోహరముగ నుండును. రైలువద్దనుంచి సేతువువైపు చూచిన ఒకయిసుకపాయ ముందు వెడల్పుగానుండి క్రమముగా సేతువువద్దకుపోవుసరికి సన్ననికోనగా తేలును. ఈ కడపటికొనకే సేతువనిపేరు. యాత్రికులు యిసుకలో నడువలేనివారు గట్టిగనుండు సముద్రపుదరినే అనగా అలలు తగులుచున్ననీటివడ్డునే నడుతురు.

సేతువును దగ్గఱగా నొకభవనము సిమెంటుతో నూతనముగ కట్టబడినది. ఇక్కడ ఏవో కొన్ని విగ్రహములున్నవి. నేను యిక్కడ హనుమంతునివిగ్రహము చూచి

నట్లు జ్ఞాపకము. అచట వేలకొలదియాత్రికులు సంకల్పాదిమంత్రములతో స్నానము చేయుచుండిరి.

ఇది సేతువనిచెప్పుట కెట్టి ఆధారములు కనబడవు. కాని తూర్పు పడమర సముద్రములు రెండునుకలియు చోటుగానున్నది. ఈ జలరాశిదృశ్యము క్రొత్తవారికి భయకరముగానుండును. పరమేశ్వరుని మహిమను దెలిసికొన్నవారికి మిగుల ఆశ్చర్యకరముగ దోచును.

హిందూ ఆచారములప్రకారము సేతుస్నానముచేయువారికి ఇక్కడ బ్రాహ్మణులు సంకల్పాదిమంత్రములు జెప్పుటకు సిద్ధముగ నుందురు. సంతానహీనులు నాగప్రతిష్ఠ మున్నగు క్రతువులు చేయుదురు. భూతప్రేతములచే పీడింపబడువారు సయితము యిక్కడ స్నానముచేసిన బాగుపడుదురను ప్రతీతిగలదు.

నేను స్నానముచేసి వెంటనే బయలుదేరి ధనుష్కోటి రైలుస్టేషనుకు వచ్చితిని. ధనుష్కోటివద్ద సత్రములుగలవు. హోటల్సు గలవు. ఇది చిన్నవూరు. స్టేషనుకు ఫర్లాంగు దూరములో విష్ణు ఆలయమున్నది. రాధారీ బంగాళాగూడ నున్నది. భరతఖండమంతటి నుండి యాత్రికులు అనుదినము వేలకువేలు వచ్చుచుందురు.

నేను సేతువునుండి వచ్చుసరికి మద్రాసుపోవు సిలోను బోటుమేలు సిద్ధముగానున్నది. నేను దానినెక్కి తిరిగి మధురకు వచ్చితిని. తిరువాన్కూరు సంస్థానమునకు ముఖ్య పట్టణమగు త్రివేంద్రంవెళ్లి అక్కడనున్న అనంతపద్మనాభస్వామిని దర్శించవలెనని కుతూహలము గలుగుటచే మధురనుండి త్రివేంద్రమునకు బయలుదేరితిని. త్రివేంద్రమునకుపోవు మార్గములో పర్వతపంక్తులు, కొండసొరియులు (టనల్సు) జలపాతములు, లోయలు, చుక్కలు మూచు ఉన్నతమైన వృక్షములుమున్నగు చూడదగిన దృశ్యములు చాలవుండుటచే మధురనుండి ఉదయము బయలుదేరితిని. మధురనుండి త్రివేంద్రంకు దాదాపు 250 మైళ్లు రు 4-0-0 రైలుచార్జి వుండును.

రైలుబండి పడమటికనుమలుదాటు భాగము చూడదగియుండును. ఈభాగము నకె ఘూట్ సెక్షన్ అందురు. ఈఘూట్ సెక్షన్ షెంకోటఅనే స్టేషనునుండి ప్రారంభించును. రైలు యిక్కడనుండి కొండల నెక్కుట దిగుట, టనల్సులో ప్రవేశించుట మున్నగు దృశ్యములు ఆశ్చర్యముగా నుండును. ఈఘూట్ సెక్షనులో రైలు ఆరు టనల్సులో పోవును. అందు రెండు చాల పొడవుగానుండును. రైలు యీటనల్సులో ప్రవేశించునప్పుడు రైలువారు పగలే దీపములను వెలిగింతురు. చీకటి అంధకారముగ నుండును. ఈ టనల్సు పైభాగమునుండి చుట్టుప్రక్కలనున్న కొండభాగమునుండి నీరు కారుచుండును. రైలు వేగముగ పోవుటచే నీటి ఆవిరివల్ల చల్లనిగాలి తగులుచు ప్రయాణీకులకు ఆహ్లాదము గొలుపు



మార్కెట్టులో నోకమూల.

చుండును. రైలు పర్వతాగ్రమున పోవుచున్నను అక్కడను కొన్ని గ్రామములు, కొబ్బరితోపులు, పొలములువున్నట్లు కనబడుచు కొన్నికొండలోయలలో రైతులు దున్నుట కానగును. రైలు పెంకోటవద్ద పడమటి కనుమలకు దాటుటకు ప్రారంభించి పూనలూరుఅనే స్టేషనుతో పూర్తిచేయును. ఈపర్వత పంక్తియొక్క అడ్డుకొలత 31 మైళ్లున్నది. రైలు యీకనుమలనుదాటి క్విలన్ అనే స్టేషనుకు చేరును. ఇది సముద్రపు దరి. ఇక్కడనుండి రైలు పడమటసముద్రపు తీరముననే దక్షిణముగ నడుచును. ఈ దృశ్యము కడుసొంపుగా నుండును. ఇదే మలబారు ప్రాంతము. పూర్వము దీనినే మళయాళ దేశమని చెప్పుదురు. క్విలన్ సముద్రతీరము రేవు పట్టణము. ఇక్కడనుండి ఎర్నాకొళం, అలప్పి, కొచ్చిన్ సంస్థానములకు సముద్రముమీద ప్రయాణము చేయవచ్చును. క్విలన్ పూర్వము పోర్చుగీసువారిది. తరువాత డచ్చివారిక్రిందికి వచ్చెను. ఇప్పుడు తిరువాన్కూరు సంస్థానము వారిక్రిందనున్నది. ఇక్కడ కొబ్బరి తోటలు అపరిమితముగానున్నవి. కొబ్బరి, కొబ్బరినార, కొబ్బరిత్రాళ్లు ఇక్కడనుండి వివిధప్రాంతములకు ఎగుమతి చేయబడును. క్విలన్ నుండి తిరువనంతపురమునకు నాలుగు గంటల ప్రయాణము. ఇక్కడ రాజుగారు వేసవిలో నుండుటకు చక్కని సమ్మర్ ప్యాలెస్ సముద్రతీరమున కట్టబడివున్నది. చిన్నగుట్టపై మరొక అందమైన రాజనగరు గలదు. క్విలన్ నుండి ట్రివేండ్రంకుపోవు రైలు మార్గము చాల మనోహరముగా నుండును. ఈప్రాంతపు గ్రామములు, మనప్రాంతముననున్న గ్రామములవలె ఒకచోటనె గృహములు గుమిగూడివుండవు. మార్గము పొడవునను కొబ్బరి పోక తోపులుండును. ప్రతి తోటలోను ఒకటిరెండు గృహములుండును. ఈరీతిగా గృహములు దూరదూరమున తోపులలోనుండును గాని ఒకేగడ్డమీద వీధులుతీర్చి గ్రామములుండును. రైలు కొబ్బరితోపులలో పోవుచున్నట్లుండును.

క్విలన్ ట్రివేండ్రములమధ్య వర్కల అను విష్ణుక్షేత్రముగలదు. ఇక్కడ శ్రీజనార్దన స్వామి కోవెలవున్నది. దేశ దేశములనుండి యాత్రికులువచ్చి స్వామిని దర్శింతురు. జనార్దన కోవెల ఒక కొండపైనున్నది. గుడి ముఖద్వారము సముద్రమువైపుకు చూచుచుండును.

### ట్రివేండ్రం లేక తిరువనంతపురం

ట్రివేండ్రం తిరువాన్కూరు మహారాజుగారుండు ముఖ్యపట్టణము. ఇది చాల పురాతనమైనది. తిరువాన్కూరుప్రభుత్వము యొక్క కచ్చేరీలు, హైకోర్టు, లాకాలేజి, ఇతర కాలేజీలు వుండుచోటు. అన్నిటికన్న ఇది గొప్పయాత్రాస్థలము. అనంతపద్మనాభస్వామి యొక్క గొప్ప ఆలయము గలదు. అనంతపద్మనాభుని దర్శనార్థం హిందూదేశమందలి నలుముఖములనుండి యాత్రికులువచ్చి స్వామినిదర్శింతురు. శ్రీ పద్మనాభుడు విష్ణువుయొక్క అవతారము. పద్మనాభస్వామి తిరువాన్కూరు సంస్థా

ధీశుల ప్రధానదైవము. సంస్థానమంతయు శ్రీపద్మనాభస్వామి పేరుననున్నది. రాజు కేవలము పద్మనాభుని సేవకుడు. అందుకే తిరువాన్కూరు సంస్థానములోని రూపాయలు, అర్ధలు, పావులాలు మున్నగు నాణెములపై విష్ణుమూర్తియొక్క చిహ్నములగు శంఖము, చక్రము అను నాణెములపై ముద్రితమైయుండును. ఇక్కడ చలామణి అయ్యే రాగినాణెములను శంఖములని, చక్రములని పిలుతురు. ఇక్కడ ఏవస్తువు ధర అడిగినను రెండుచక్రములని మూడుచక్రములని చెప్పుదురు. మన దేశపు నాణెములు అక్కడ చెల్లవు. మనమా దేశము వెళ్లినప్పుడు మన రూపాయను వారి నాణెములక్రింద మార్చుకొనవలెను. మన రూపాయకు 28½ చక్రములిత్తురు. 18 వ శతాబ్దమున మహారాజు మార్తాండవర్మకాలములో తిరువాన్కూరు సంస్థానమంతయు శ్రీపద్మనాభస్వామివారికి అర్పింపబడినది. మతకర్తలని ప్రఖ్యాతిగాంచిన శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్య, శ్రీచైతన్య మున్నగు మహనీయులు శ్రీపద్మనాభుని దర్శించినట్లు చెప్పుదురు. అనంతపద్మనాభస్వామి దేవాలయము చాల విశాలమై నలువైపులనున్న గాలిగోపురములతో నొప్పారుచున్నది. ఆలయముఖద్వారమునున్న గొప్పగాలిగోపురము ప్రక్కనే పెద్దకోనేరుగలదు. దీనినె పద్మతీర్థమందురు. సముద్రమువద్దనున్న కోనేరును శంఖతీర్థమందురు. ఆలయముఖద్వారమున అనుదినము ఉదయము సాయంకాలము పెద్ద నగార, ఢంకా, నబత్ ఖానా వాయిద్యములు మ్రోగింతురు. గోపురద్వారమువద్ద సంస్థానసిపాయిలు కాపలాకాయుచుందురు. యాత్రికులు స్వామిని దర్శించవలెనన్నచో ముందుగ వారిచొక్కాలను పైదుస్తులను తీసివేసి ఉత్తరీయములను నడుమునకు కట్టుకొనవలెను. చెప్పులతో లోనికి వెళ్లనీయరు. టాకుతీకులతో కోటుబూటులతో నీటుగ పోవుటకు వీలులేదు. పూర్వము బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు ఆలయములోనికి వెళ్లవచ్చునుగాని పంచములు వెళ్లుటకు వీలులేదు. కాని ఈమధ్య మహారాజుగారు పంచములు సయితము ఆస్థాననిబంధనల ననుసరించి ఆలయములోనికి వెళ్లి స్వామిని దర్శించవచ్చునని శాసనముచేసి యున్నందున యిప్పుడు పంచములు సయితము లోనికి పోవుచున్నారు. కాని గర్భగుడిలోనికి బ్రాహ్మణులు తప్ప మిగత కులమువారు లోనికిపోరాదు.

సంవత్సరమునకు రెండుసార్లు అనంతపద్మనాభస్వామికి గొప్పఉత్సవములు జరుగును. ఇవి అర్పాసి, పంగుణిమాసములలో జరుగును. ఆనాడు మహారాజుగారు స్వామివారి యావత్తుజవహారితో, సంస్థానసిబ్బందితో సముద్రతీరమునకు ఉత్సవముతో వెళ్లును. మహారాజుగారు భృత్యునికైవడి నడుమునకు ఉత్తరీయమును బిగించుకొని దండము చేబూని పాదచారియై స్వామి ముందు నడచును. ఆరుసంవత్సరముల కొకసారి మురజపం అనే ఉత్సవము జరుగును. ఈ ఉత్సవము 56 దినములు చేతురు. కడపటి

దినమున లక్షదీపములు వెలిగింతురు. దీపములకుగాను దేవాలయముచుట్టును అనేక వరుసలుగ ఇత్తడి ప్రమిదలు ఆలయకుడ్యములలో నిమడ్చబడియున్నవి. ఆనాడు యీ దీపావళిని చూచిన నక్షత్రమండలము భూమిపై వ్రాలినదని ఆశ్చర్యపడుదుము. ఈ ఉత్సవమునకు కొన్ని లక్షలు వ్యయము చేయబడును.

దేవాలయములో అనుదినము మధ్యాహ్నము, సాయంత్రము బ్రాహ్మణులకు అన్నదానము చేయబడును. ఎన్నాళ్లుతిన్నను వద్దనువారుండరు. వందలకొలది యాత్రికులు యీప్రసాదము నిత్యము భుజించుచుందురు.

త్రివేంద్రమునే అనంతశయనం అనియు, తిరువనంతపురమనియు పిలుతురు. త్రివేంద్రంలో ముఖ్యవీధి ఒక్కటేవుండును. ఇది కొన్ని మైళ్ల పొడవున్నది. పట్టణముయొక్క వైశాల్యము 16 చదరపు మైళ్లుండును. దాదాపు 96 వేలమంది జనసంఖ్యగలది.

ఇక్కడ చూడదగినవి నేపియర్ మ్యూజియము. ఇందు సింహశార్దూలాది వన్యమృగములు, చిత్రవిచిత్రములగు పక్షిసంతానము ఇతరమృగములు చాలగలవు. ఉద్యానవనము శోభాయమానమై యాత్రికుల నానంద వార్ధిలో ముంచివేయును. మరియు హుజూరు కచ్చేరి, ఆర్ట్సు సైన్సు కాలేజీలు, స్త్రీల కాలేజి, లాకాలేజి, పబ్లికులైబ్రరీ, అబ్జర్వేటరీ, బీచి మున్నగునవిగలవు. యాత్రికుల సౌకర్యార్థము పట్టణములో చాల సత్రములున్నవి. హోటల్సుకు లెక్కలేదు. ఈ హోటల్సులో కొబ్బరినూనె వాడుదురు. మన ప్రాంతములవారికి కంతహితవుగానుండదు. పట్టణమంతయు కొబ్బరిచెట్లతో నిండియుండును. దూరమునుండిగాని ఏదైన ఎత్తైన ప్రదేశమునుండిగాని చూచిన పట్టణమంతయు ఒక పెద్ద కొబ్బరితోపులోనున్నట్లు గానబడును. త్రివేంద్రము దక్షిణఇండియా రైల్వేవారి దక్షిణకొన. దీనిపైన రైలులేదు.

### కన్యాకుమారి

త్రివేంద్రమునకు 40 మైళ్ల దూరము కన్యాకుమారి అగ్రమున్నది. నేను కన్యాకుమారీ అగ్రమును చూడవలెనని బస్సులో ఉదయమున పయనమైతిని. త్రివేంద్రమునుండి కన్యాకుమారికి ఒక రూపాయి బస్సుచార్జి. మూడుగంటల ప్రయాణము చాలమనోహరముగ నుండును. రోడ్డుకు యిరుప్రక్కల నారికేళ వృక్షముల తోపులు, మధ్యమధ్య ఆతోపులలో కుటీరములు త్రోవ పొడుగునను యిదేవిధముగ వుండును. అందువల్ల బస్సు ఒకేతోపులో ప్రయాణము చేయుచున్నట్లుండును. ఎక్కడను ఎడారిస్థలము కానరాదు. మధ్య నగరకోవెల్ అనే బస్తీవున్నది. ఇక్కడ బస్సులుమారును. ఇది తిరువాన్కూరు సంస్థానంలోని పెద్దబస్తీలలో నొకటి. వర్తక స్థానము. ఇక్కడనుండి కన్యాకుమారికి పోదుము. ఇది హిందూదేశముయొక్క దక్షిణకొన. బంగాళాఖాతము అరేబియా

సముద్రము రెండును కలియుచోటు. ఈ అగ్రముకొన నిలబడి సముద్రమువైపు చూచిన అమితాశ్చర్యమును భీతియు గలుగును. రెండు బ్రహ్మాండమైజలరాసులు మిళితమైన దృశ్యము చూచినప్పుడు ఆ అనంతునియొక్క మహిమలు నాస్తికుని సయితము ఈశ్వరుని ఉనికిని జ్ఞప్తికి దెచ్చును.

ఇక్కడ సముద్రముఒడ్డున చిన్నచిన్న రాతితిప్పలున్నవి. అందువల్ల నీటిఅలలు లేవు. యాత్రికులు నిర్భయముగ సముద్రములోదిగి స్నానముచేయవచ్చును.

ఈ అగ్రముకొనను చిన్న మంటపమున్నది. దానికి దగ్గఱగ కన్యాకుమారి దేవాలయమున్నది. ఇదిచాల పురాతనమైన దేవాలయము. కన్యాకుమారి దేవాలయాంతర్భాగము విశాలముగనుండును. కన్యాకుమారివిగ్రహము సముద్రమువైపునకు నిలబడియున్నట్లుండును. ఈ విగ్రహము చాల చక్కగనుండును. మంచిగంధముతో ముఖభాగము పూయబడి ముక్కు, కనులు, నోరు తీర్చినట్లు అమర్చబడి నగలుచే నలంకరింపబడియుండును. ఈ విగ్రహముచూచి తీరవలసినదేగాని వర్ణింపనలవిగాదు.

యాత్రికులు వేనవేలువచ్చి సముద్రస్నానముచేసి అమ్మవారిని దర్శింతురు. ఇక్కడ చందనము అమ్మబడును. యాత్రికులు గొనిపోవుదురు.

సముద్రతీరము యిసుకతిన్నెలతోను నిండియుండును. చల్లదనమునకుగాను కొన్ని బంగళాలు తీరమున నిర్మింపబడియున్నది. యాత్రికులసౌకర్యార్థము వసతిగృహములు, సత్రములు, హోటల్సువున్నవి. హిందూదేశమున బుట్టినవారు ఈ కన్యాకుమారీ అగ్రమునుచూచితీరవలెనని కోరుచున్నాను.

## బర్మా చందాదారులకు గమనిక

1937 వ సం. ఏప్రిల్ నెల మొదలు తేదీనుండి పోస్టల్ రేట్లు ఎక్కువ చేయబడినవి గాన బర్మా చందాదారులకు 'గృహలక్ష్మి' సంవత్సరము చందా 4-8-0, విడిప్రతి 0-6-0 అనియు మనవి చేయుచున్నాము.

మేనేజరు, గృహలక్ష్మి.

# ధర్మసోదరి

దుర్గంపూడి సోమరాజుగారు

ఆరోజున నేను పార్కు వైపునకు షికారువెళ్ళితిని. పార్కును సమీపించి ఒకచోటకూర్చున్నాను. వెనుక ఎవరో ఏడుస్తూవున్నట్లు వినిపించినది వెనుకకు తిరిగి చూచితిని ఇరువదిసంవత్సరముల యువతి కృశించిన దేహముతో, వాడిన మోముతో, కన్నులవెంట అశ్రువులరాల్చుచు, ధరించిన పాతచీరను సవరించుకొనుచు, నిలబడివున్నది. ఆమె స్థితిని చూచుసరికి నాహృదయము నీరైపోయినది.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావు" అని ప్రశ్నించితిని.

"ఏమీలేదుబాబూ" అని ప్రత్యుత్తరము. కాని ఏడుపునిలిపినది.

"ఏమనుకోకండి. చెప్పండి పరవాలేదు" అని మరల యడిగితిని.

ఏమిచెప్పను – మూడురోజులనుండి భోజనం–" అని మరల యేడ్చుట కారంభించినది.

"మూడురోజులనుండియు భోజనంలేదా ?" అని ఆశ్చర్యముతో అడిగితిని.

"లేదుబాబూ ! మూడురోజులనుంచి–"

నా జేబునుండి డబ్బుతీసి ఆమెకు ఇచ్చితిని

"డబ్బా ! బాబూ" అని కంగారుపడుచు అడిగినది.

"అవును, తీసుకో."

"వద్దుబాబూ ! ఏమిచేసుకోను ?"

"మరేమీభయంలేదు. తీసుకో."

"వద్దుబాబూ ! డబ్బుమాత్రంవద్దు."

ఆమె మాటలవలన నాకు మరింత దయకలిగి "మంచిది, హోటలువరకు రా. భోజనం పెట్టిస్తాను." అని అతికష్టముతో హోటలువద్దకు తీసుకువెళ్ళితిని.

"రామశింగూ ! అడిగినపుడంతా ఈమెకు భోజనము పెడుతూవుండు. ఆడబ్బు నేనుయిస్తాను." అని చెప్పి, ఆమెదు స్థితికివగచుచు, భగవంతునిలీల తలపోయుచు, యింటిమార్గముబట్టితిని.

మూడురోజులవరకు మరల ఆవైపునకువెళ్లుటకు తీరుబడిలేకపోయినది. ఆరోజున హఠాత్తుగా జ్ఞాపకమువచ్చినది. ఆయువతి ఏమైనదా ? అని. తొందరగా బయలుదేరి హోటలువద్దకు వెళ్లి— "రామశింగూ! ఇప్పటివరకూ, ఆమెకోసం ఎంత ఖర్చుఅయింది?" అని అడిగితిని.

"బాబూ! అప్పటినుండీ మళ్లీ ఆమె హోటలుకు రాలేదండీ. నిన్న ఆమె ఇటువైపు వెళ్లుతూంటే నేను వెళ్లి ఆమెను తీసుకువచ్చాను. ఆమెను ఎంత ప్రార్థించినా భోజనము చేయలేదు."

"మంచిది. యీసారి ఆమె నీకు కనుపిస్తే మా యింటికి ఏలాగైనా వచ్చేటట్టుచేయి" అని నేను వెళ్లిపోయితిని. నాలుగురోజులైనది. నేను పేపరు చూచుకొనుచు ఆఫీసుగదిలో కూర్చొనియుంటిని. మానౌకరు ఎవరితో కసరుచున్నట్లు వినుపించినది. ఎవరా? అని నేనువెళ్లిచూచితిని. ఆ యువతిమీదనే వాడు కేకలు వేయుచున్నాడు. వానినిమందలించి, ఆమెను లోపలకుపిలచితిని.

ఆమె లోపలకువచ్చి "బాబుగారూ! తమరు ఎందుకు పిలిపించారు" అని ప్రశ్నించినది.

"అమ్మా ఏమీలేదు. ఈలాకూర్చో నీవుచూస్తే ఉత్తమకాంతలా కనిపిస్తావు. నీకీస్థితి ఎట్లాకలిగింది?

నీచరిత్ర తెలుసుకుందామని నాకు చాలా కుతూహలంగావుంది. కాబట్టి సంకోచం లేకుండా నీకథఅంతా చెప్పాలి.”

“అయ్యా! నాకథ ఏమివింటారు? నేను ఒక ఆపత్తులోబడి యిట్లాతిరుగుచున్నా. యిదే నాకథ.”

“కాదమ్మా! ఇదిఅంతా నేనుచూస్తూనేవున్నాను. కాబట్టి నీకథ మొదటినుండి విపులంగాచెప్పాలి”

నమస్కారాలుబాబూ! తమరు చాలదయాళులు. ఇప్పటివరకూ ఎవ్వరూ నన్నిట్లాఅడగలేదు. చెప్పటానికి నా కథఏమివుంది? తమవంటిసజ్జనులుఅడిగితే చెప్పకపోవడము ధర్మంకాదు. కాని నిష్ప్రయోజనం అయిన నాజీవితచరిత్ర వినదలిస్తే, మీయొక్క అమూల్యమైన కాలమంతా వృథాఅయిపోతుంది.”

“కాదు, కాదు, నాపనికంటే నీచరిత్రే అమూల్యమైందని తలుస్తున్నా.”

“మంచిదిబాబూ! అట్లయితే వినండి. నేను ఒక సాధారణకుటుంబంలో జన్మించాను. తండ్రిపేరు ఏమిచెప్పనులెండి. వారు చాలాసజ్జనులు. వారెంతో విచారించి, శ్రమపడి, బి.ఏ చదివిన ఒకధనికుని కుమారుడికి నన్నిచ్చివివాహంచేశారు. కాని ఏంలాభం. నాతండ్రిగారు ఎంతఆశతో వివాహంచేశారో, అంతా వ్యర్థమైంది. వెంకట్రావనే స్నేహితుని ప్రోత్సాహంచేత, నాభర్త త్రాగుడుకు అలవాటై, పూర్తిగా వేశ్యాలోలురైయ్యారు. మందలించటానికి ఇంటిలో పెద్దలెవ్వరూలేరు. అందుచేత వారిదుర్నడతలకు ఏమీ అడ్డులేకపోయింది. నా భర్తగారితోపాటు వెంకట్రావుకూడా మాయింటికి తరచుగా వచ్చేదువాడు. ఏదో వంకతో నాతో మాటలుకలుపుతూ, మెల్లిగా వేళాకోళాలు ఆడడంకూడా ఆరంభిగాడు. అంతాగ్రహించి నేను తప్పుకోనితిరగ నారంభించాను. అతనిచేష్టలన్నీ నాభర్తగారికి చెప్పాను. ఇకమీదట అతనిని ఇంటికిరానివ్వద్దనికూడా చెప్పాను. కాని ఏంలాభం. ఎంతచెప్పినప్పటికీ, నాభర్తగారు చిరునవ్వునవ్వుతూ పూరుకొనేవారు. గాని అతడిరాకపోకలకుమాత్రం ఏమీ అడ్డుచెప్పలేదు.

ఆతరువాత నా భర్తయింటికిరావడంకూడా అరుదైంది. ఎప్పుడో వారానికి ఓసారివచ్చేవారు. ఒకరోజున వెంకట్రావు వంటరిగావచ్చి—అదంతా ఎందుకులెండి. అతనిని తలవాచేటట్టు చీవాట్లు పెట్టాను. అతనికి కోపంవచ్చి, నీభర్తను నీకుగాకుండా చేసి, నీకష్టకష్టాలు కలిగింపకపోతే నాపేరు వెంకట్రావుకాదని, కొన్నిదుర్భాషలాడి వెళ్లిపోయాడు. నాటినుంచి నాభర్తజాడే తెలియకపోయింది. ఆయనకోసరం వెతికించాను. కాని ఉపయోగం లేకపోయింది. అప్పటినుంచీ నాకు భయమెక్కువైంది. ఇక అక్కడవుంటే వాడు అన్నంతపనీ చేస్తాడని తలచాను. ఆరాత్రేబయలుదేరి యీవూరు వచ్చాను. ఈ వూళ్లోమాత్రం నాకెవరున్నారు. నానాటికి నాకు బ్రతుకే కష్టమైపోయింది. దీర్ఘచింతచేత నేనొక ఉన్మాదిగా అవుతున్నాను. అనాథను, యిన్నిబాధ లనుభవిస్తున్నాను. ఆభగవంతుడు నన్నుయింకా ఎన్నికష్టాలపాలు చేయదలచాడో?” అని ఆమెకన్నుల నీరునింప నారంభించినది. ఆమెను చూచిన నాకు చాలవిచారమైనది.

“అమ్మా! నీ వెంతవరకు చదివావు?” అని అడిగితిని.

“మావూరిస్కూల్లో అయిదవ తరగతివరకు చదివాను. తరువాత మాతండ్రిగారు భారత—భాగవతాలు యింటివద్దే చదివించారు.”

“మీతల్లితండ్రి లెక్కడున్నారు?”

“నాదురదృష్టం కొలదివారుకూడా అకాలమరణం పాలయ్యారు.”

“మాయిల్లులో పనిచేయడానికి నీకిష్టమేనా? అట్లాగైతే నీకే కష్టాలుండవు.”

"మీకుదయవుంటే సంసిద్ధురాల్ని."

"మంచిది ఈ యింట్లోనే ఒక గదిలో నీవు ప్రత్యేకంగావుండు. యీ పదిరూపాయలు తీసుకొని నీకు కావలసిన సామాన్లుతెచ్చుకో. నన్ను నీసోదరునిగా తలచుకో. నాభార్యకూడ నీకు సహకారిణి గా వుంటుంది. టైమయింది. నేను మిల్లుకు వెళ్లి వస్తాను." అని నేను మిల్లునకు వెళ్లితిని. సాయంకాలము ఇంటికి వచ్చితిని. నాభార్య ఎదురుగావచ్చి—సుశీలను మిల్లులో వుంచకండి" అనెను.

"సుశీల ఎవరు?"

"మీక్రొత్త సోదరి"

నేను నవ్వుచు—"ఆమె పేరు సుశీలా?"

"అవును, ఆమె మంచి ఉత్తమురాలులా కనిపిస్తోంది. అందుచేతే ఆమెను మిల్లులో వుంచవద్దని కోరుతున్నా. ఆమిల్లులో అనేకరకాల మనుష్యులుంటారు. ఇంటిదగ్గిరేవుంచండి. నా కూ్కడా ఆసరంగావుంటుంది."

"కొన్నిరోజాలు వెళ్లనీ మంచిచెడ్డలు బాగా విచారించి తరవాత యిరిటిదగ్గరేవుంచుతా."

"మీయిష్టప్రకారం చెయ్యండి."

అప్పటినుండి సుశీల గదిలోపలకు వెళ్లితిని. ఆమె వంటచేసుకొనుచుండెను. నన్ను చూచినతోడనే లేచి నిలచి—"వచ్చారా బాబూ!" అనెను.

అవును ఇక్కడ నీకేమీ కష్టంగా లేదుగదా?"

"లేదు బాబూ! మీ దయవల్ల ఎటువంటికష్టం గాని కొరతగాని లేదు."

"సుశీలా! ఇకనన్ను బాబూఅని పిలవడం మా అన్నయ్యా అని పిలువు. నీవు నాకు సోదరివి." నా మాటలవలన ఆమెకు హర్షాతిరేకముతో కన్నుల నీళ్లు వచ్చినవి. రుద్ధకంఠములతో—"మంచిది ఇక మిమ్ము అన్నయ్యాఅనే పిలుస్తాను." అనెను.

"అమ్మాయీ నేను వెళ్లుచున్నా నీకేమైనా అవసరం ఆయితే మీవదినగారిని అడుగు. సందేహంవద్దు."

"నేను అనుకున్నంతా జరిగింది. చూశారా పాపం?" అని నాభార్య అనెను.

"ఏం జరిగింది" అంటిని నేను.

"ఇది చూడండి!" అని నాచేతికి ఒక కాగితపుముదత యిచ్చినది.

అది చదివితిని నాకుఅమితముగు కోపము వచ్చినది. "ఆ బద్మాషునకు యింతటి సాహసమా! ఇప్పుడే చెప్పెదను వానిపని." అని వెంటనే దుస్తులను ధరించి ఆఫీసునకు వెళ్లితిని. మేనేజరు పిలిపించి—"ఇదేమిటో చూడు! నీ వ్రాతేనా అది?" అని అడిగితిని. తప్పించుకొనుటకు వీలులేక అతను తడబడుచు—"అయ్యా! అవును అవును" అనెను.

"బుద్ధిలేదా? తుచ్ఛుడా! ఇట్టి దుర్నడత ఎక్కడ నేర్చుకొన్నావు? ఆమె నాసోదరిఅని తెలియదూ నాపనిలోనుంచి ఇప్పుడే తొలిగిపో. ఇక క్షణమైనా యిక్కడ వుంటానికి వీల్లేదు." అని యింటికివచ్చితిని.

సుశీల దగ్గరకువెళ్లి, "సోదరీ! రేపటినుంచి నీవు మిల్లుకు వెళ్లవద్దు" అంటిని.

"అన్నయ్యా! వెళ్లకపోతే ఊరకే నావంటి అబలను ఎంతకాలం పోషిస్తారు. నే నొకదిక్కులేని పక్షిని" అని ఆమె అమితముగా దుఃఖింప నారంభించినది.

"అమ్మాయీ! నీవట్లు దుఃఖింపవద్దు. నీవు అబలవు కావు సబలవు. ఇంటివద్ద మీవదినగారికి తోడుగా వుండు."

సుశీల కన్నులవెంట ప్రేమాశ్రువులు రాల "తమ దయ" అని లోపలకువెళ్లినది.

నాటి ఉదయమున మేము ముగ్గురము కాఫీ త్రాగుచుంటిమి. వాకిట దభాలుమని శబ్దమైనది. సుశీల వెంటనే బయటకువెళ్లినది. ఆమె వెళ్లుటయే తడవుగ ఏడ్చుచున్న శబ్దమును వినవచ్చినది. ఆతురతతో నేను నాభార్యవెళ్లిచూడ చింకిగుడ్డలతోడను మాసిన గడ్డముతోడను కృశించిన దేహముతోడను ఒక వికృతాకారుడు మాచీడీలపైబడియుండ సుశీల రక్తము కారుచున్న వానిశిరమును ఒడియందు వుంచుకొని తుడుచుచు, మమ్ముల చూచుటయే తడవుగ పెద్దపెట్టున ఏడ్చుచు "అన్నయ్యా! వీరు నాభర్తగారు" అని ఏడువసాగినది. "ఈతడు నీభర్తా! మరేమీ భయంలేదు" అని మేము ముగ్గురము అతనిని లోనికి తీసుకువచ్చి గాయమునకు కట్టుకట్టి మంచముపై పరుండబెట్టితిమి.

ఒకమాసము దినములకు అతడుసరియగు ఆరోగ్యస్థితికి వచ్చెను. నేను వంటరిగానుండజూచి ఒకనాడు నావద్దకువచ్చి—"అయ్యా! ఇంతవరకు మీరు నా భార్యను దయతో కాపాడినందుకు మళ్లీ యిప్పుడు నాప్రాణాలు రక్షించినందుకు మీకు నా కృతజ్ఞతా వందనాలు. ఏపాపం ఎరుగనినేను ఒక మిత్రుని ప్రోత్సాహంచేత దురలవాట్లకు అలవాటుపడ్డాను. నాభార్యని పడరానికష్టాల పాలుజేశాను. నాఆస్తి అంతా పోగొట్టుకొన్నాను. ఆఖరికి తింటానికి తిండి కూడా దొరక్క బిచ్చగాడినయ్యాను. అంతా అయింది అయిందానికి విచారిస్తే లాభంలేదు. కాబట్టి మీరు మీసోదరియందున్న దయకొలది నాకూడా మిల్లులో ఏదైనా ఒకపని యిప్పించకోరుతున్నా" అని దీనముగా అడిగాడు.

అంతట నేను "ఇప్పటికైనా పశ్చాత్తాపం కలిగినందుకు సంతోషమైంది. ఇంతచదువు చదివావు. ఏంలాభం బూడిదలోపోసిన పన్నీరు భ్రాంతిచేశావు. పోనీలే యిప్పటినుండైనా జాగ్రత్తగావుండు. కొద్ది రోజులక్రిందే మేనేజరు వెళ్లిపోయాడు. ఆస్థానే నీవు వుండి జాగ్రత్తచూస్తావుండు." అని చెప్పితిని.

ప్రస్తుతమాతడు మాఆఫీసు మేనేజరు పదవిలో నున్నాడు. అలుమగలు అరమరలులేక హాయిగా వుంటూవున్నారని నాభార్య పలుమారులు నాతో చెప్పుచుండును.

---

## నమస్సు

అ. సీతారాముడుగారు

తేనెతుంపురులు గురిసి తేఁటదనము
గలిగి వెలిఁగెడి కమ్మనికైతలల్లి
తెలుగుపలుకు వెలందిని దృప్తిపఱచి
కాఁపురముసల్పు కీరితి కన్నెఁగూడు
కైనరులఁ గడుపారఁగఁ గన్నతల్లి!

కత్తిచేఁబట్టి సంగరాంగణముఁజొచ్చి
శత్రువీరుల గుండియల్ జలదరింప
వారిమార్కొని చెండాడి పచ్చినెత్తు
టను వసంతమాడి విజయాంగననువలచి
వన్నెకెక్కినయోధులఁ గన్నతల్లి !!

అరిమహావీర నాగహార్యత్తులగుచుఁ
బ్రజలఁదాఁగన్న బిడ్డలవలె నెచూచి,
వారి కష్టసుఖముల నారసి పరి
పాలనము సేయు – ఆంధ్రగీర్వాణభాష
లందఖండమహాపాండితిఁ బొందినట్టి
నిఖిలభువనప్రపూర్ణ విర్ణిద్రమైన
ఖ్యాతిగల సార్వభౌములఁ గన్నతల్లి !!!

పగతుర నెదిర్చిపోరాడి వారివక్ష
ములఁ జెకల్చి కండలను గ్రద్దలకు నేయఁ
గలిగినంతటి శౌర్యవతులగు వీర
వనితలనుగని విఖ్యాతి వడసినట్టి
అమలగుణగణాలంకృతా! ఆంధ్రమాత!!
సర్వలోకపూజ్యా! నమస్కారమమ్మ.

# బెంగాలీ మిఠాయి

## పంచదార—పాకము

బెంగాలీమిఠాయికి—ఏ మిఠాయికైనా—పంచదారే ముఖ్యమని ప్రత్యేకముగా జెప్ప వలసవచ్చిన విచిత్రముగనే గన్పట్టును. ఐనను పంచదార బెంగాలీమిఠాయిలో గలుపురీతి తెలిసికొనదగినది. ఇతరవస్తువులతోబాటు వారు మిఠాయిచేయునపుడు పంచదార నటులేగలుపక సాధారణముగా పాకము చేసి కలుపుదురు. బెంగాలీమిఠాయిచేయుటలో చక్కెర చేర్పమనినపుడంతయు నీవిధముగనే—ప్రత్యేకముగ చెప్పినతప్ప—కలుప వలసియుండును. జిలేబీవంటివానికి ముందే పాకము తయారుచేసికొనవలసి యుండు నను టందరెఱిగినదే. పంచదార నటులనే గాని, పిండిగాచేసికాని పాకముచేసిగాని కలుపనగును. దేశవాళీపంచదార (Brown Sugar) పిండిగాను, చాకగను దొరుకును కాని చక్కెర యెంత తెల్లగనున్న పదార్థములంత మనోహరముగా నుండును.

### పాకము

బెంగాలీవారు వేయు పంచదారపరిమాణమునుబట్టి పాకము నాలుగువిధములుగా విభజింతురు. ఈవిషయమందసాధారణ ప్రజ్ఞయున్నదప్ప వీనిని వేరువేరుగా గుర్తించి నిర్ణయించుట సాధ్యముగాదు. కాని రెండు రకములను మాత్రము—పలుచన, చిక్కన పాకములు—జ్ఞాపకముంచుకొనదగును.

5 ఔనుల చక్కెరను 1½ ఔనుల నీటిలో లో తైనతట్టలోవేసి పొయిమీద నుంచి క్రింద బాగుగామంట వేయువలయును. కొంచముసేపు ఉడికినతరువాత పైకితేలిన మైలను దీసివేయవలెను. పాక మింకను శుద్ధియగుటకొక పెద్దగరిటెడు పాలను సమానమగు నీటితోగలిపి పైన చిలకరింపవలెను. పిదప మంటనుతగ్గించి, మైలనంతయు దీసిన తరువాత నుడుకుచున్నపుడు దించుకొని పలుచనిగుడ్డలో వడియగట్టుకొనవలెను.

దీనిని వేరొకపాత్రలోనుంచి పొయిమీద బెట్టవలయును. ఈపాకము [illegible]టనుండి ధారగాపడుస్థితిలోనున్న నది మొదటిరక (లేబాకము) మనబడును. చిక్కనయి ధార విరిగిపోవుచున్న రెండవస్థితికి (ముదురు పాకము) వచ్చినదనెదరు. పాకము తెల్లనై జిగటయై నలిపిన పొరపొరలుగా నైపోయిన మూడవ రకమందురు. పూర్తిగా నెండి పోయినరీతి గన్పట్టునపుడు నాల్గవ రకమందురు.

వీనిలో మొదటిరకము పదార్థముల నుడికించుటకును, రెండవరకము వానిని నానవేయుటకును, మూడవరకము పైన రాయుటకును, నాల్గవరకము పూయుటకు నుపయోగింతురు.

మిఠాయిదినుసులలో నానవేయుటకు తయారుచేయు పాకము ముందే సిద్ధము చేసికొని నానవేయు సమయమందు వేడిచేయుదురు. నానవేయుసమయమున

పదార్థములుగూడ వేడిగానుండవలయును. లేకున్న సరిగా నానవు. వానిని పొయిమీదనుండి తీసినవెంటనే పాకములోనికి వేయుట మంచిది. వీని నుపయోగించువఱకు పాకమునందే యుండనివ్వవలయును. లేకున్న అవి రుచికరముగనుండవు.

కొన్ని సమయములందు చక్కెరను కొన్ని మార్పులతో నుపయోగింతురు. పంచదారకు సాధారణముగా వాతావరణమునుండి చెమ్మను గ్రహించు గుణముగలదు. కాబట్టియే యే మిఠాయియైనను కొంతకాలము గాలియందార బెట్టిన చెమ్మగిల్లును. ఇటుల గాకుండుటకై పంచదారను పై చెప్పబడిన పాకములలో నాల్గవరకము పాకమును తరువాతకూడ నుడికించి పూర్తిగా నీటిని దీసివేతురు. మిగిలిన పంచదారను ఆరనిచ్చి పిండిచేయుదురు. దీనిని మిఠాయిదినుసులలో వాడిన చెమ్మగిల్లును.

### బెల్లము—చెరుకుపానకము

బెంగాలీ మిఠాయిలో కొన్నింటికి పంచదారకు బదులు బెల్లమును, చెరుకుపానకము వేయుచుందురు. చెఱుకుపానకమును మిఠాయిదినుసులందు ఉత్తమజాతి యనిపించుకొన్న పదార్థముల కుపయోగింపరు.

బెల్లమునుకూడ చక్కెరతో కలిపియే యుపయోగింతురు కాని వట్టిబెల్లమును మాత్రము వాడరు. చెరుకుపానకమునకంటె చెమ్మగనున్న దేశవాళీ పంచదారను వాడనగును.

# ఇదివరకు తెలియకపోతే—
# —ఇపుడు తెలుసుకోండి

### చేపలు గూళ్లు ఏలా కడతవి?

చేపలు నీళ్లలో గూళ్లుకట్టుకొని నివసిస్తాయంటే మనకు ఆశ్చర్యంగానే ఉంటుంది. కాని అటువంటి గూళ్లు చేపలు చాలా కట్టుకుంటవి. ఆగూళ్లు వస్తుల సంభారాలుగా ఉంటాయి. ఆకులు, చిన్న పుల్లలు గడ్డిపరకలు మొదలగువాటిని తీసుకొనివచ్చి వాటికి శరీర ద్వారాలనుండివచ్చే ఒకచేత వాటినిఅతికించి గూళ్లను తయారుచేస్తాయి. ఆగూళ్లు రెండుప్రక్కల తెరచియే ఉంటాయి. గూళ్లకట్టేటందుకు కావలసిన పరికరాలను మగచేప తెస్తుంది. ఈ గూళ్లు ఆడచేప సంచుపుగా లోపలికి పోయి బయటకు వచ్చేటందుకు సరిపడేటంత పెద్దవిగామాత్రమే ఉంటాయి. అంత చిన్న చేప నీళ్లలో ఇల్లు కట్టుకొంటోందంటే చాల తెలివైనదనే చెప్పాలి.

> 1. నాణ్యాల అంచుల్ని గరకుగా ఎందుకు చేస్తారు?
> 2. మొదట లైట్‌హౌస్ ఎవరు కట్టారు?
> 3. సాలీడుగూడు కట్టటమెందుకు?
> 4. తెలుపు నలుపు మనుష్యులు.
>
> మొదలైనవన్ని వచ్చేసంచికలో చూడండి.

### త్రాగుబోతులద్వీపం ఎక్కడఉంది? దాని కాపేరెందుకు వచ్చినది?

పూర్వం స్కాట్లాండుదేశములో లాక్‌లమండు దీవులలో కొకదానిని త్రాగుబోతులద్వీపం అని పిలిచేవారు. ఈద్వీపంలో త్రాగుబోతుభార్యలు నివసించేవారని చెప్తుతూఉంటారు. ఆ త్రాగుబోతుభార్యలను వారిభర్తలు ఒక మంచినీళ్లకుండ, ఒకరొట్టెముక్క మాత్రమే వదిలివేసివారట.

ఈద్వీపం ఇంకా అనేకవిషయాలకు ప్రసిద్ధి కెక్కింది. ఇక్కడ చాకమానులాంటివృక్షాలు చాల ఉన్నాయి. ఈవృక్షాలను పూర్వము రాబర్ట్ ది బ్రూసు అనువాతడు తన సైన్యానికి విల్లులనుతయారు చేసుకొందుకు వాటినివాడాడు.

లాక్‌లమండులో ఇతర దీవులతోపాటు ఈ దీవి కూడా దిక్కులేని స్త్రీపురుషులకు రక్షకస్థానంగా ఉపయోగపడేది.

### పక్షుల గ్రుడ్లన్నీ ఒకేరంగుగా ఎందుచేత ఉండవు?

పక్షులగ్రుడ్లకు రకరకముల రంగులు ఇవ్వడములో ప్రకృతి వాటికెంతసహాయపడుతూందో మనము గమనించవలసిఉంది. ఈరంగులే వాటిని రక్షిస్తున్నాయి. మనము పరిశీలించిచూస్తే పక్షులు చీకటిగాను మరుగుగాను ఉండే సన్నటి బొరియలలో మాత్రమే తెల్లగ్రుడ్లు పెడతాయి. గూళ్లలో పెట్టే గ్రుడ్లు రంగులు రంగులుగా ఉంటాయి.

ఇసుకలోను, రాళ్లలోను గూళ్లు కట్టుకొన్న పక్షుల గ్రుడ్లు చూస్తే అవి అక్కడఉన్న రాళ్లరంగుగానే ఉంటాయి. అందుచేత అవి గ్రుడ్లులాగ కనపడక రాళ్లముక్కలలాగే ఉంటాయి. గులకరాళ్లలో పెట్టే పక్షులగ్రుడ్లు గులకరాళ్లలాగే ఉంటాయి. కొన్ని గులకరాళ్లతో ఆగ్రుడ్లను కలిపిచూస్తే తేడా ఏమీ కనిపెట్టలేము. పొదలలో పెట్టిన గ్రుడ్లు ఆకుపచ్చగాను నీలంగాను ఆయా పొదలఆకులరంగులను బోలి ఉంటాయి. అందుచేతనే పక్షులగ్రుడ్లకు అపాయములేదు. ఈరీతిగా ప్రకృతి పక్షిజాతికి సహాయం చేస్తోంది.

### ఏదేళ్లకే పాటలువ్రాసి సంగీతకచ్చేరీలు చేసిందెవరు?

మొజార్టు అనే అతడు (1756–91) అయిదేళ్ల

వయసులోనే పాటలువ్రాసి పాటకచ్చేరీలు చేసి గొప్ప ఫిడేలిస్టు అనిన్నీ, పియానిస్టు అనిన్నీ పేరు సంపాదించాడు. ఆరవసంవత్సరము పూర్తికాకుండానే యూరపులోని దేశాలన్నీ తిరిగి కీర్తి సంపాదించాడు. పదునాలుగవ సంవత్సరములోనే ఒక సంగీతనాటకముకూడ రచించి అనేకచోట్ల ప్రదర్శించినాడట. అంతేకాకుండా ఆరేడు చర్చి సంగీతము వృద్ధిచేసి ప్రదర్శనాలలో తన నైపుణ్యాన్ని చూపించినాడు.

## మోరీలెవరు? ఎక్కడుంటారు?

న్యూజీలాండులో నివసించేవారికి మోరీ లని పేరు. వారు బూడిదరంగుగాను కండపుష్టిగాను ఉంటారు. వాళ్లకి శరీరాలనిండా బొమ్మలు వేయించుకోవడమూ, పచ్చబొట్లు పొడిపించుకోవడము చాలప్రీతి. వాళ్ల ముఖ్యమైన ఆయుధము గండ్రగొడ్డలివలె ఉంటుంది. దానిని ఎప్పుడు మణికట్టుకు తగిలించుకొని తిరుగుతూంటారు. ఆస్ట్రేలియాలో ఉండే నల్లజాతివారికంటె మోరీలు నాగరికతగలవాళ్లనే చెప్పాలి.

పూర్వము మోరీలు దక్షిణపసిఫిక్ సముద్రదీవులలో నివసించేవారనిన్నీ, వాళ్ల పూర్వీకులు 6 పెద్దనావలలో ఎక్కి న్యూజీలాండు వచ్చారనిన్నీ కథలవల్ల తెలుస్తూఉంది.

మోరీలలో చాలభాగము నార్తుఐలండులోకూడ ఉండి అక్కడఉండే తెల్లవాళ్లతో సమానహక్కులు అనుభవిస్తూ పార్లమెంటులోకూడా సభ్యత్వాన్ని పొందినట్లు తెలుస్తూఉంది.

మోరీలలో ఇద్దరు కలుసుకొన్నపుడు అభివందనము చేసుకోవడము చాల విచిత్రంగా ఉంటుంది. ఒకరినొకరు ముద్దుపెట్టుకోవడము, షేకుహాండు ఇచ్చుకోవడము కాకుండా ముక్కూ ముక్కూ రాసుకుంటారు.






బెర్లినునగర విశ్వవిద్యా
లయమునందిటీవల ఎగిరిన
యొక బెలూన్.

# సోయాబీను—అంతర్భాగములు

పదువుల రామచంద్రయ్యగారు

ఆహారపదార్థములందు సోయాబీను విలువ, వానిచే చేసికొనదగు పలువిధములగు పదార్థములు పంటపెట్టుట మొదలగు విషయములనుగూర్చి యిది వఱకే వ్రాయబడినది. సోయాబీను లితర వస్తువులకంటె బలకరమైనదని యెఱుంగుట కందున్న ముఖ్యాంశముల నెఱుగుట మంచిదను నుద్దేశముచే నీ వ్యాసము వ్రాయబడుచున్నది. సోయాబీను పంట పూర్తియగుటకు 80, 90 దినములుమాత్రము చాలును. ఈ స్వల్పకాలమునందే యితర పదార్థము లందుకంటె ఎన్నోరెట్లెక్కువగా శరీరమునకు ముఖ్యముగ గావలసిన మాంసకృత్తులు, లోహములు, క్రొవ్వు భూమి నుండి యిది గ్రహించుట భగవంతుని విచిత్రసృష్టి కొక నిదర్శనము గానున్నది.

సోయాబీనునందలి ముఖ్యాంశముల నెఱుగగోరి చాలమంది శాస్త్రజ్ఞులు చాలకాలమునుండియు పరిశోధన సలుపుచున్నారు. వీరిలో జపాను, అమెరికా, యూరపుఖండమందలి రసాయనశాస్త్రజ్ఞు లెక్కువ కృషి సల్పియున్నారు. ఇతర ధాన్యములందును పప్పుదినుసులందునుగల వస్తువులకును వీనికి నెక్కువ భేదము గలదు. ఈ భేదమంతయు నత్రజని పదార్థము లందును, క్రొవ్వు పదార్థములందును, పూర్తిగ పిండి పదార్థములు లేకుండుట యందును గలదు. శరీరాభివృద్ధిని ముఖ్యము నెంపొందించు మాంసకృత్తులు కూడ దీనియం దితర పప్పుదినుసులకంటె అమితముగ గలవు.

| | చెమ్మ నూటికి | మాంసవృత్తులు నూటికి | క్రొవ్వు నూటికి |
|---|---|---|---|
| సోయాబీను | 9.9 | 36.5 | 17.5 |

పై పట్టికయందు గనబరచిన మాంసకృత్తులు, క్రొవ్వు, ఖనిజలవణములు యితర పప్పుదినుసులందు తక్కువగా గన్పడుచున్నవి.

సోయాగింజ వేరువేరు భాగములకూడ జూడుడు.

| గింజభాగము | గింజలోనున్న భాగము | ఎండు పదార్థము | నత్రజని సం. పదార్థములు |
|---|---|---|---|
| గింజమొత్తము | 100 | 90.18 | 38.06 |
| బీజపత్రములు | 90 | 89.43 | 41.33 |
| భ్రూణము | 2 | 87.99 | 36.93 |
| బీజత్వక్కు | 8 | 87.47 | 7.00 |

| గింజభాగము | పిండి పదార్థము | క్రొవ్వు | యాష్ |
|---|---|---|---|
| గింజమొత్తము | 12.6 | 17.80 | 4.44 |
| బీజపత్రము | 14.60 | 20.75 | 4.38 |
| భ్రూణము | 17.32 | 10.45 | 4.08 |
| బీజత్వక్కు | 21.02 | 0.60 | 3.83 |

సుమారు ఐదువందల రకముల సోయాబీనుల రసాయనికవిశ్లేషణ (Chemical analysis) మొనర్పగా నూటికి 30 మొదలు 45 మాంసకృత్తులును, 12 నుండి 24 వఱకు క్రొవ్వును, 4 నుండి 5 వఱకు ఖనిజలవణములును గలవని తేలినది. మంచూరియాందుకూడ నిట్టి రసాయనిక విశ్లేషణనుచేయగా నీక్రింది ఫలితము వచ్చినది.

| | | |
|---|---|---|
| మాంసకృత్తులు | నూటికి | 42.84 |
| క్రొవ్వుపదార్థములు | ,, | 19.90 |
| ఖనిజలవణములు | ,, | 4.15 |
| నీరు | ,, | 8.60 |

వీనిలో నెల్ల పసుపు పచ్చగనున్న సోయాబీనులం దివి యెక్కువగానున్నటుల దేలుచున్నది. కావున మనదేశమందు వీనినే పంటబెట్టుటుత్తమము.

సోయాబీనునందున్న ఖనిజము లీ క్రింది పట్టిక వలన దెలియగలదు.

| | | |
|---|---|---|
| పొటాసియం | నూటికి | 2.095 |
| సోడియం | ,, | 0.380 |
| కాల్షియం | ,, | 0.230 |
| మాగ్నము | ,, | 0.224 |
| గంధకము | ,, | 0.444 |
| హరినము | ,, | 0.025 |
| భాస్వరము | ,, | 0.649 |

ఇతర పప్పుదినుసులం దీ ఖనిజములు సోయాబీను నందుకంటె చాలతక్కువ.

సోయాబీనునందుగల మాంసకృత్తులు ఇతర వస్తువు లందుగల మాంసకృత్తులకంటె శ్రేష్ఠమైనవనియు క్షారకరములనియు (Alkalyzing) నందుచే నారోగ్యమున కత్యంతావశ్యకమనియు చెప్పబడుచున్నవి.

సోయాబీనునందు ఎ. బి. డి. విటమినులుండును. వీనిని నానవేసినపుడు కూరగాయలందును, ఫలములందును అమితముగగల సి. విటమినుమీద నుత్పన్నమగును.

ఇతర దినుసులం దెక్కువగానున్న పిండిపదార్థములు (Starch and Carbohydrates) సోయాబీనునందు చాలతక్కువ. కొన్నిరకములలో స్టార్చి లేనే లేదు. కాని కార్బొహైడ్రేట్సు మాత్రము కొద్దిగ గలవు.

సోయాబీను నితరవస్తువులతో పోల్చిచూపుటకు క్రింద టేబిల్ యివ్వబడినది.

| వస్తువు. | మాంసకృత్తులు నూటికి | క్రొవ్వు నూటికి | పిండిపదార్థములు నూటికి | లవణములు నూటికి | కాలరీలు నూటికి |
|---|---|---|---|---|---|
| సోయాబీను | 40 | 20.3 | 24.6 | 4.8 | 2100 |
| గోధుమ | 12 | 1.7 | 73.7 | 1.5 | 1750 |
| బ్రీ(జొన్న) | 10 | 5 | 74.2 | 2 | 1750 |
| బియ్యము | 7.5 | 1.8 | 82 | 0 8 | 1900 |
| కాయధాన్యం | 19 | 4.3 | 54 | 2.8 | 1530 |
| బఠాణీ,చిక్కుడు | 24 | 1.5 | 60 | 3 | 1700 |
| నువ్వులు | 24 | 40 | 26 | 2 | 2270 |
| వేరుసెనగ | 24 | 45 | 22 | 2 | 2459 |
| మాంసము | 24 | 2.5 | .. | 1.5 | 576 |
| గ్రుడ్లు | 14.8 | 10.5 | .. | 1 | 720 |
| పాలు | 4 | 5 | 4 | 0.8 | 480 |
| బంగాళాదుంప | 3 | 12 | 14.2 | 1 | 195 |

ఎముకలను గట్టిపరచుటకును, రక్తము నభివృద్ధి చేయుటకును కాల్షియము, ఇనుము చాల ముఖ్యమైనవని వైద్యులందరంగీకరించినదే. ఇది తక్కువఅయినపుడే శరీరము క్షీణించి క్షయ మొదలగు రోగములు వచ్చును. సోయాబీనునం దితరవస్తువులతో కూడ నివిగలవు. సోయా పెరుగునందు కాల్షియ మెక్కువగ నుండునని చైనా, జపాను, శాస్త్రవేత్తలు నిర్ణయించిరి.

## పుష్పచయము

### రాజ్యభ్రష్టులైన రాజులు

ఆర్చిడ్యూకుఆట్టో యను ఆష్ట్రియాదేశపురాజు యిరువదినాలుగవ సంవత్సరముననే దేశమునుండి వెడలగొట్టబడెను.

1931వ సంవత్సరమున పదమూడవ అల్ఫాన్సో అను స్పెయినుదేశపురాజుకూడ తన రాజ్యాధికారు లెదురొడ్డుటచే రాజ్యము వదలిపోయెను. అతడు మితిలేని ఖర్చుచేయుటచే భార్యనుండికూడ ఎడబాపు చేయబడెను. రాజ్యభ్రష్టుడైనను యిప్పు డతనివద్ద ఇరువదిలక్షల లగాయితు ఏబదిలక్షల డాలర్లవరకు ధనము గలదనియు, ఇంకను కొంతధనము తనస్నేహితులవద్ద దాచెననియు చెప్పుదురు. ఇప్పటికైనను యీతడుధనము విచ్చలవిడిగా ఖర్చుపరచుచు, మిక్కిలి విలువగలదుస్తులను ధరించుచు సౌఖ్యజీవనము చేయుచుండును.

నిరుటిసంవత్సరము ఇతోపియాదేశపురాజు నీగసు ప్రాణములను దక్కించుకొని తన కుటుంబముతో రాజ్యమువదలి ఇంగ్లాండుచేరెను. అతనివద్ద ఎంతధనమున్నది లెక్కలేదు. ముసోలినీసైన్యములు దాడి వెడలినపుడు అడిస్ అబాబానుండి పారిపోవుచు నీగసుధనపుసంచులను, నగలనుకూడ వెంటనిడుకొనిపోయెనట. కాని యీతనివద్ద ధనమేమియులేదని చెప్పును.

జర్మనీదేశపు కైజరు రాజ్యమువదలి హాలండులోను, డూరన్ లోను కులాసాగా కాలముగడుపుచుండును. అతనికి ధనకాంక్షయేలేదు. తిరిగిరాజ్యము సంపాదించు నాశకూడలేదట. ఇపుడతనికి డబ్బదియేడు సంవత్సరముల వయస్సు.

ఫెర్డినాండను బల్గేరియాదేశపురాజు జర్మనీలో మంచి సౌధములో స్వేచ్ఛాజీవనము చేయుచుండును. అతనివద్దకూడ లెక్కలేనంతధనము గలదట. కాని యీతడు పెద్దరణముచే బాధపడుచుండును.

ఎనిమిదవఎడ్వర్డు ఈమధ్యనే సింప్సనుసతిపైగల వ్యామోహముచే రాజ్యమువదలి డ్యూకుఆఫ్ విండ్సర్ అను పేరుతో ఆష్ట్రియాలో కాలముగడుపుచుండును. ఇంతపెద్ద రాజ్యమును గోల్పోయిన రాజు యిదివరకెన్నడును లేడు.

ఇట్టిరాజు లిపుడెంతమందియోయున్నారు.

### బర్మా సంవత్సరాది ఉత్సవము

బర్మాలో ఏప్రియల్ 13వ తేదీని నూతనసంవత్సరము ప్రారంభమయినది. బర్మాశకము ప్రకారము 1299వ సంవత్సరము వచ్చినది. సంవత్సరాదినాడు స్త్రీ పురుషులందరు ఉత్సవములందు పాల్గొందురు. ఈ యుత్సవము 3 దినములవరకు జరుగును. దీనికే మహాతింగయను ఉత్సవము అందురు. నీటి ఉత్సవమనికూడ పేరుగలదు. అనగా ఆనాడు ఒకనిపైనొకరు ఉదయమునుండి సాయంకాలమువరకు నీరు చల్లుకొందురు. ఏవ్యక్తైన నీటికిభయపడి పారిపోయినయెడల వారికాసంవత్సరమంతయు చెడుపుగలుగునని నమ్మకము. దినమంతయు తడిసినవారికి నూతనసంవత్సరము శుభప్రదమని యనుకొందురు. స్త్రీపురుషులందరు తమపిల్లలతోగూడ శుభ్రమైనవస్త్రములు నగలుధరించి వీధులందు సంతోషముగా నాట్యముచేయుచు నీటిఉత్సవమున గుంపులు గుంపులుగా పోవుదురు. బండ్లు, కారులు, బస్సులు, లారీలుమున్నగు వాటిని హంసలు, నెమళ్లు, పాములు మున్నగు బొమ్మలతో నలంకరించి ఉత్సవములకు తీసికొనివచ్చెదరు. వీధులన్నియు నీటిప్రవాహములతో నిండిపోవును.

పూర్వము ఇంద్రునకును బ్రహ్మకును యుద్ధము జరిగెనట. ఆయుద్ధములో ఓడిపోయినవాడు తనతలనిచ్చివేయుటకు వాగ్దానము చేసుకొనెను. అంతట ఇంద్రుడు జయించెను. బ్రహ్మశిరస్సు క్రిందపడుచుండగా భూమికి కీడుసంభవించునని వట తనచేతులతో ఆపెనట. ఆబ్రహ్మదేవుని శిరస్సుయొక్క వేడిచల్లార్చుటకు నీటియుత్సవము చేయుదురని కథగలదు.

## జపాను దేశపు విద్యావిధానము

జపానుదేశమున బాలబాలికలలో నూటికి 99 మంది బడికిపోవుదురు. విద్యావిషయమున జపానుదేశము చేసికొను శ్రద్ధ తక్కిన యేదేశములును తీసికొనుట లేదు. అచట వారమునకు 6 దినములు బడియుండును. సంవత్సరమునకు స్కూలు తెరచు దినముల సంఖ్య 220 లగాయతు 240 వరకు యుండును. యూరపు, అమెరికా దేశములలో సంవత్సరమునకు 150 దినములుమాత్రమే స్కూలు తెరచెదరు. జపానులో వేసవికెలవులు 6 వారములు మాత్రమే యిచ్చెదరు.

అచట ప్రైమరీస్కూలు విద్యముగించుటకు 6 సం.లును మిడిలుస్కూలు విద్యకు 5 సం.లును, హైస్కూలువిద్య 5 సం., కాలేజీవిద్యకు 3 సం. లు మొత్తము చదువు పూర్తియగుటకు 17 సంవత్సరములుపట్టును. పరీక్షలు చాలకఠినముగానుండును. పట్టభద్రుడగుటకు సుమారు పాతిక మొదలు ముప్పదిసంవత్సరముల ప్రాయమువచ్చును. ప్రైమరీవిద్య బాలబాలికలందరు చదివితీరవలెను. అటుపైన నూటికి పదిమందిమాత్రమే యున్నతవిద్యనభ్యసింతురు. జపానుదేశస్థులకు వారి మాతృభాష నేర్చుకొనుటయే చాలకష్టము. ప్రైమరీవిద్యార్థి దినమునకు 7 గంటలు స్కూలులోను, 7 గంటలు ఇంటివద్దను మొత్తము 14 గంటలువంతున ఆరుసంవత్సరములు కష్టపడిచదువును. అప్పటి కాతనికి వార్తాపత్రిక లర్థముచేసికొను జ్ఞానమువచ్చుట దుర్లభము. వారి కితరభాషలు త్వరగారావు. జపానుభాష కితరభాషలు సంబంధము తక్కువ అచటిప్రజలకు విద్యనేర్చినగాని జీవనోపాధి కష్టమగును. అచట విద్యార్థులకు 'స్కాలరుషిప్పులు' ఇచ్చు సంస్థలులేవు. పలుమారుపరీక్షతప్పినచో జపానువిద్యార్థి నిరాశచేసుకొని ఆత్మహత్యచేసుకొనును. అందువలననే జపానులో సంవత్సరమునకు 3000 పైగా విద్యార్థులలో ఆత్మహత్యలుజరుగును.

ఎంతధనికుడైనను జపానువిద్యార్థి సామాన్యదుస్తులనే ధరించవలెను. అచట యుపాధ్యాయునికి జీతము నెలకు ఇరువదిడాలర్లుండును. జపానులో సైనికశిక్షణ మెక్కువ. వ్యాయామక్రీడలు ప్రతిబడియందును ప్రధానవిద్యగా నుండును. విద్యపూర్తియగు నప్పటికి ప్రతివిద్యార్థియు పరిశ్రమలు స్వంతముగా చేయుట కారి తెరియుండును. అందువలననే జపానుదేశమున తయారుకాని వస్తువు లేనేలేదు. వారు విదేశవస్తువుల నుపయోగించరు సరిగదా విదేశపద్ధతులనుగూడ ననుసరింపరు. "Japanese are not imitators but they are assimilators."

జపానుదేశీయులు కష్టజీవులు. ఒకనిముషమైనను కాలమువృథాపుచ్చరు. ధైర్యవంతులు, బలవంతులు. అచటి విద్యావిధానమే వారిని స్వతంత్రజీవులను చేయుటకు మిక్కిలి తోడ్పడుచున్నది.

## లమెరికాలో అతిబాల్యవివాహములు

అతిబాల్యవివాహములు అమెరికాలో మిక్కుటముగ జరుగుచున్నవి. ఆడపిల్లలకు పదేండ్లు వచ్చు సరికే కొన్నిచోట్ల వివాహములగుచున్నవి. ఇంత చిన్నవయస్సుననే వివాహమేమిటని ఎవరైన అడిగిన యెడల "ఇతరులు యెంతహాయిగా వుంటున్నారో మేము అంతహాయిగనుండవలెను. వివాహవిషయము వారివారి ఇష్టానుసారము జరుగవలె"నని కొంతమంది సమాధానము చెప్పుచున్నారు.

ప్రతిసంవత్సరము యునైటెడుస్టేట్సులో పదిహేను సంవత్సరముల వయస్సుగల 340 మంది బాలికలు వితంతువులగుచున్నారు. అదేవయసుగల 14800 మందికి వివాహములగుచున్నవి. అందులో 250 మంది వివాహవిచ్ఛేదము చేసుకొనుచున్నారు. కొలరాడో, ఫ్లోరిడా, ఇడాహో, మేరీలాండ్, మిస్సిసిపీ, రోడ్ ఐలండ్, టెన్నెసీ, వాషింగ్‌టన్ అను తొమ్మిదిస్టేట్సు పన్నెండు సంవత్సరముల వయసుగల పిల్లలను వివాహముచేసుకొనుట కనుమతి నిచ్చుచున్నవి. ఈ బాల్యవివాహసమస్య తరతరములనుండి యున్నప్పటికిని మాసముదినములక్రిందట యచటి ప్రజలలో తీవ్రవుద్రేకమును పుట్టించినది.

ఇటీవలనే మెనిఫీల్డు అను 38 సంవత్సరముల వయస్సుగల నీగ్రో 14 ఏండ్ల వయసుగల డెల్లా అను అమెరికా స్త్రీని వివాహముచేసుకొనుటకు నిశ్చయించుకొనెను. వారిద్దరు పరస్పరము ప్రేమించుకొన్నందున డెల్లా తల్లి వారి వివాహమున కనుమతినిచ్చెను. వారి వివాహము చట్టసమ్మతముగానందున వధూవరులను వారి తల్లిదండ్రులను అరెస్టుచేయబడిరి. అందుచేత అమెరికాలోవున్న ప్రతిసంస్థయును యిట్టి ఇబ్బందులు లేకుండ చట్టమును మార్పించుటకు తీర్మానములుగావించి ప్రకటించి ఆందోళనచేయుచున్నది.

ఇంకను చాలచిత్రమైన వివాహములు జరుగుచున్నవి. 54 యేండ్ల గ్రుడ్డివాడు 11 సంవత్సరముల బాలికను వివాహముచేసికొనెను. ఓక్లహోమాలో రైతు లిద్దరుభార్యలు చనిపోగా వారు 11, 14 సంవత్సరములు వయసుగల పిల్లలను పెండ్లిచేసికొన్నారట. 19 ఏండ్ల యువకుడు 12 ఏండ్ల బాలికను వివాహమాడెనట. ఆమె 12వ ఏటనే బిడ్డను కనబోవుచున్నది. ఆమె పండ్రెండేండ్ల వయసుగలదైనను చాల ముసలిదానివలె కనబడును. ఆమె వివాహమునుగూర్చి ఎవరైనను ప్రశ్నించినయెడల "వారమునకు 4 పౌ. 15 షిల్లింగులు వచ్చునపుడు నే నెందుకు వివాహముచేసుకొనకూడదు?" అని జవాబుచెప్పును.

హిందూదేశమును తన యిష్టమువచ్చినరీతి దూషించి వ్రాసిన మేయోగారి దేశమునం దీ యమానుష కృత్యములు జరుగుచున్నవి. దీని కామె యిపు డేమిసమాధానము జెప్పునో జూడవలసియున్నది.

## సోవియటురష్యా స్త్రీలు

జారు పరిపాలనావిధానమున స్త్రీ బానిసగా పరిగణింపబడినది. వ్యక్తిస్వాతంత్ర్య మించుకైనను లేక తనకున్న ఆస్తితోసహా భర్త యధీనమున జిక్కువడి జీవితము గడపుచుండెడిది. వివాహానంతరము భర్త వదలివైచినచో జీవనోపాధికైనను లేక పడరానిపాట్లు పడుచుండెడిది. రష్యాజనసంఖ్యలో పదవభాగము గల మహమ్మదీయుల విషయమునకూడ చట్టము సమానమే.

1866 వ సంవత్సరమున జెనీవా కాంగ్రెసులో స్త్రీలకు దాస్యవిమోచన గలిగినగాని దేశకల్యాణమునకు భంగము వాటిల్లునని కారల్ మార్క్సు చెప్పెను.

సోవియటురివల్యూషను వచ్చినదాది వేలకొలది స్త్రీలు వారి తండ్రులనుండియు, భర్తల యధీనమునుండియు తప్పించబడిరి. పురుషులు స్త్రీలను బానిసలుగకొని యింట కట్టివేయుట మాపివేయబడెను. సర్వసమానత్వ మేర్పడి గృహనిర్వాహణమందును, రాజకీయాదివిషయములందును స్త్రీలు సమభాగినులుగానుండునట్లు శాసించబడెను. స్త్రీపురుషసమానత్వ మేర్పడుటవలన స్త్రీ పురుషునిపై జీవితకాలమంతయు నాధారపడవలసిన నవసరములేదు.

అందుచే స్త్రీపురుషులు సమానముగ కష్టపడి పనిచేయుట కేర్పాటుచేయబడెను. జారు పరిపాలనమున స్త్రీలుకూడ మిల్లులందును, వర్తకస్థానములందును పనిచేసియున్నప్పటికిని వారు బానిసలుగ జూడబడుటచే వారి వేతనములు చాలతక్కువగనుండెడివి. నేడట్లుగాక స్త్రీల కెక్కువగౌరవమునిచ్చి పురుషులతో సమానముగ వేతనములిచ్చుచు ఉన్నతస్థానములగూడ నియమించుచుండిరి. సోవియటు గవర్నమెంటులో మొదటనే సుమారు నూరుమంది స్త్రీలను నియమించి గౌరవించిరి. వ్యవసాయశాఖలోగూడ స్త్రీలు పాటుపడి సాధించి రాష్ట్రమున కమితమగులాభము చేకూర్చుచున్నట్లు తెలియుచున్నది.

విద్యావిషయమున స్త్రీలకు పురుషులతో సమానముగ విద్య గఱుపబడుచున్నది. వ్యవసాయము, వర్తకము, ఇతరపరిశ్రమల విషయములన్నియు నేర్పెడుచున్నవి. కావుననే రష్యాలో నిరక్షరకుక్షు లెవరును లేరు. నిరుద్యోగసమస్య అసలేలేదు.

స్త్రీలకు పనిచేయుటకును, చదువుటకును, తగిన అవకాశమిచ్చి ఆరోగ్యవతులుగానుండుటకు వలయు సదుపాయములు చేయబడెను. స్టాలిన్ ఇట్లు చెప్పెను: "Man must be grown as carefully and attentively as a gardener grows a favourite fruit tree." కావుననే సోవియటుపరిపాలన యీపద్ధతి నవలంబించి శాస్త్రోక్తముగ చిన్నతనమునుండియు బాలబాలికలను పెంచుట, విద్యగఱపుట మున్నగువిషయములం దెక్కుడు శ్రద్ధ వహించుచున్నది.

గర్భిణిస్త్రీలకు 16 వారములవరకు పనినుండి సెలవొసంగబడును. పిల్లలను కనువరకు గవర్నమెంటు వారు గర్భిణీస్త్రీల ఆరోగ్యముచెడకుండ తగిన వైద్యసహాయముచేయుదురు. శిశుపోషణవిషయమై స్త్రీ యెంతమాత్రము కష్టపడ నక్కరలేదు. గవర్నమెంటువారే యీ బాధ్యతవహించి శిశువులను పెంచి పెద్ద జేసి విద్యనభ్యసింపజేతురు. కాన రష్యాపరిపాలనావిధానమున నెట్టివిషయమందును కొఱతలు లేవు. స్త్రీపురుషులు సమానహక్కులతో నిశ్చింతగ కాలముగడుపు సర్వసౌఖ్యములతో తులతూగుచుందురు.

## హిందూదేశము బీదస్థితిలోనుండుటకు కారణము

సర్ హారిసింగుగోరుగారు హిందూదేశపుబీదస్థితికి చెప్పు కారణము నిజమేనా?

"హిందూదేశము ప్రాచీనపద్ధతులను విసర్జించి నవీనపాశ్చాత్యపద్ధతుల నవలంబించినగాని వృద్ధి కానేరదు. కాలమునుబట్టి ఆచరణమారవలెను. మనదేశమున యిట్టి మార్పులేకుండుటవలననే పేదఱికము వృద్ధియగుచున్నది. అందముగను మృదువుగనునుండు వస్త్రములు మిల్లులు తయారుచేయుచుండగా మనవారు వడుకునూలు వస్త్రములనే యుపయోగించుచున్నారు. మిల్లువస్త్రములు ఖద్దరువాటికంటె చాల చవుకగా తయారగుచున్నవి. "The race between handicraft and machinery is a race between pigmy and giant": మనదేశీయు లింకను మూడువేలసంవత్సరముల పూర్వపు పద్ధతులనే నవలంబించుచున్నారు. యంత్రసహాయములేనిదే మన మేవస్తును చవుకగ తయారుచేయలేము. కాన మనము ధైర్యమువహించి నవీనపద్ధతుల నవలంబించి దేశమును పునర్నిర్మాణము గావించినగాని విదేశములవలె వృద్ధికాదు."

## 'టీ' ఉపయోగములు

టీ నవీనమైన పానీయముకాదు. చీనాదేశములో క్రీస్తుపూర్వము 2737 సంవత్సరములనుండి టీ త్రాగెవారట. ఆశతాబ్దములో షెన్‌నంగ్ అను వైద్యశాస్త్రజ్ఞుడిట్లు వ్రాసెనట. గుండెలో వాపువల్లగాని కఫమువల్ల గాని వేడిచేసినయెడల టీ ఆవేడిని తగ్గించును. దాహమును యుపశమింపజేయును. మనసున కుత్సాహమును, సంతోషమును కలుగజేయును. మత్తుకలుగజేయదుగాన మద్యపానముకంటె మేలైనది. మంచినీటిలో వ్యాధి క్రిములుండును. కాబట్టి టీ మంచినీటికంటె మంచిది."

1653 సంవత్సరములో అలెగ్జాండరు డిరోడ్సుఅను దొరగారు టీనిగురించి వారి యభిప్రాయము నిట్లు తెలిపిరి. "టీని ప్రజలందరు దివ్యౌషధముగా పరిగణించవలెను. తలనొప్పిని అద్భుతముగా పోగొట్టును. మూత్రరోగములను, వాతరోగములను కుదుర్చును." ఐరోపాఖండమున టీ ప్రాముఖ్యమునకు వచ్చుటకు కారణమేమనగా వారు టీ సుగుణములను స్వానుభవమువల్ల తెలుసుకొన్నారు.

# సినీమా లోకము

## దశావతారములు: విప్రనారాయణ: రుక్మిణీహారన్: స్టూడియో వార్తలు

### దశావతారములు

క్వాలిటీ పిక్చర్సువారి తోలిటాకీ దశావతారములు మద్రాసులో రెండవవారము ప్రదర్శింపబడుతూవుంది. వేమవరపు రామదాసు పంతులు రుక్మిణి లక్ష్మీపతిగార్లు యీ పౌరాణిక గాధ సభ్యత, నీతి వగైరా వుత్కృష్టాంశాలతో చిప్పిలుతూవుందని అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఈ పదవతారముల చిత్రములో ఒక్క కృష్ణావతారఘట్టము సంపూర్ణకళలతో ఆకర్షవంతము గా వుంది. చిత్రములో ప్రజాసమూహములను ఆకర్షించే ట్రిక్కు సీనులకు ప్రాధాన్యత యివ్వబడింది.

*    *    *    *

భారతదేశములోని అనేక ప్రదేశములలోని సుందరదృశ్యములను ఒకరీల్ ఫిలిము గా తయారుచేసి యితరదేశములకు పంపడానికి కొంతమంది బొంబాయిలో యోచనలు చేస్తూవున్నారు. ఇందుకు ఒక కార్యవిధానము తయారౌతూవుంది.

*    *    *    *

### విప్రనారాయణ

కలకత్తా అరోరాఫిలిం కార్పొరేషన్‌వారి విప్రనారాయణ తెలుగుటాకీ షూటింగు చురుకుగా సాగుతూవుంది. సుప్రసిద్ధ బెంగాలీ ఆర్టిస్టు అహీంద్ర చౌదరిగారు పొందు రికార్డు చేస్తారు. ఇదివరలో ఫిలిములను తయారుచేయడములో ఆయనకుగల అనుభవము ఈ విప్రనారాయణ టాకీని నిర్దుష్టముగ చేయుటలో తోడ్పడకలదు. ఇంతవరకు పదివేల అడుగుల ఫిలిం తయారయింది. షూటింగు రాత్రింబగళ్లు జరుగుతూవుంది.

*    *    *    *

### రుక్మిణీహారన్

భారతలక్ష్మీ పిక్చర్సువారి తెలుగుటాకీ "రుక్మిణీహారన్" షూటింగు పూర్తిఅయినదనీ, అరోరా ఫిలిం కార్పొరేషను వారిద్వారా మే మధ్య భాగంలో విడుదల అవుతుందనీ తెలుస్తూవుంది. ఆంధ్రదేశప్రఖ్యాతదారలు, గాయకులు, చొప్పల్లి రఘురామయ్య, నిడుముక్కల, శాంతకుమారి యీ చిత్రములో పాల్గొన్నారు. దీనిని మొదటితరగతి చిత్రముగా తయారుచేయుటకు శక్తికొలది ప్రయత్నిస్తున్నారు.

*    *    *    *

### వేల్ పిక్చర్సు స్టూడియో, మద్రాసు

తేనాంపేటనుండి గిండీకి మార్పటం పూర్తిఅవుతూ ఉన్నది. భక్తాలమహారాజు చరిత్ర అరవంలో స్వంతంగా తయారుచేస్తున్నారు.

*    *    *    *

### కార్తికేయాఫిల్ము లిమిటెడ్, మద్రాసు

హెచ్. యం. రెడ్డిగారు త్వరలో యీ స్టూడియోలో ప్రథమ తెలుగు ఆదర్శ సాంఘిక చిత్రం తీయబోతున్నారు.

*    *    *    *

### నేషనల్ మువిటోన్, మద్రాసు

తెలుగు రుక్మాంగద పూర్తిఅయింది. త్వరలో విడుదలచేస్తారు.

*    *    *    *

### సెంట్రల్ స్టూడియోస్, కోయంబత్తూరు

మీరు సి. యస్. ఆర్. ఆంజనేయులుగారితో తెలుగులో భక్తతుకారాం తీయబోతున్నారు.

*    *    *    *

### దుర్గా సినిటోన్, రాజమండ్రి

సి. పుల్లయ్యగారు ఏఫిలిం తీసేదీ ఎవరికీ తెలియుటంలేదు.

*    *    *    *

### ఆంధ్ర సినిటోన్, విశాఖపట్నం

శ్రీనివాసకల్యాణం తీస్తారని వదంతి. మెషనరీ వగైరా యింకా వస్తూవేఉన్నది.


SASTRY'S HOTEL & RESTAURANT

# గ్రంథ పరిచయము

## ఓటు జాతర

ఇది నూతనరాజ్యాంగపద్ధతి ప్రకారముగల ఓటుహక్కు నేరీతిగా నుపయోగింపవలయునో శాసనసభల కెవరిని యెన్నుకొనవలెనో సూచించుచు వ్రాసిన సనాతన మతగ్రంథము. కాంగ్రెసు దేశద్రోహి మతద్రోహి యనియు కావున దానికెవరును ఓటుచేయక సనాతనధర్మమునకు హాని గలిగింపమని వాగ్దానముచేసిన పక్షమునకు మాత్రము ఓటివ్వవలయుననియు నిందలి సారాంశము.

దీనికై యీగ్రంథకర్త యెక్కువ కృషిసల్పి బూతుల నొక్కచో చేర్చియున్నారు. అర్ధశతాబ్దమునుండియు దేశీయమోక్షమునకై ప్రయత్నించుచున్న కాంగ్రెసు చేసినదంతయు దేశద్రోహము; అపకారము, మతధ్వంసము. త్యాగమూర్తులై ధనమానప్రాణములకు లెక్కింపని నేతలందరు ఎందులకు పనికిమాలినవారు. దేశోపద్రవకారకులు. గాంధివంటివారు తోకలేని హనుమంతుడు. స్వరాజ్యోద్యమమంతయు మిథ్య; అందుపనిజేసినవారందరు తెలివితక్కువవారు; చేసినదంతయు దేశమునకు వినాశము. ఇటువంటివి వేలు లక్షలీ గ్రంథమున గలవు. వీనినెల్ల నోపికతో నీరీతి రచించిన శిరోభూషణము వేంకటరంగాచార్యులుగారు శ్లాఘనీయులు.

కాంగ్రెసును, కాంగ్రెసునందు బనిజేసిన వ్యక్తులనుగూర్చిన నిందలు, తిట్లు, సంకుచితాభిప్రాయములు, నికృష్టాశయములు, నింతహేయముగ ప్రదర్శింపగల గ్రంథము 'నభూతో నభవిష్యతి'. సనాతనాచారపరాయణుల దృష్టి దేశసౌభాగ్యమున కేవిధముగ ప్రయోజనమగునో నిందు స్పష్టమగును. ప్రతులు గ్రంథకర్తగారివద్ద దొరుకును. వెల తెలియదు. వలయువారు గ్రంథకర్తగారికి 12 చెంబుడుకట్టవీధి, పశ్చిమమాంబళము త్యాగరాయనగరుపోస్టు మదరాసు, అని వ్రాయగలరు.

## వెలమవీర శ్రేయోభిలాషిణి

అష్టావధానిని కవయిత్రి బాలసరస్వతి బిరుదాంకితులగు శ్రీమతి మాకునూరి ఆనందమాంబగారిచే రచింపబడినది. వరశుల్కమును నిరసించుచు నిందు 16 పద్యములు గలవు. సాంఘిక అన్యాయములను స్త్రీలు పట్టుదలతో ప్రతిఘటించుచున్నారనుట కిదియొక నిదర్శనము.

## షాజీ

ఆధునిక కవికుమార మృదుహృదయ కుహరములనుండి బైలుదేరి వందరి సానందరసనిమగ్నులజేయు దివ్యగానవాహినిలో నిదియొక కెరటము. ఆధునికమైనను, పురాతనమైనను సత్కవిత్వమునకుగల గుణమెుక్కటియే. అది హృదయానందదాయిని. పుట్టపర్తి నారాయణచార్యులు రచించిన నీఖండకావ్య మీగుణమునకు నిదానము. ఈతడు 'స్వాతంత్ర్యవీణమీటి' నీచిరుత కావ్యమున నతిమనోహరమగు కవితాగానమును ప్రమోయించి వీనుల విందొనర్చినాడు.

వలయువారు గ్రంథకర్తగారికి సంస్కృతకళాశాల తిరుపతికి, వ్రాయగలరు. వెల తెలియదు.

## బారిష్టరు పార్వతీశము-(మొదటిభాగము-ద్వితీయముద్రణము)

'బారిష్టరు పార్వతీశము'ను దీనినిరచించిన మొక్కపాటి నరసింహశాస్త్రినిగూర్చి యాంధ్రులకు నూతనముగా జెప్పవలసినదేమియునుండదు. ఈపుస్తకము ద్వితీయముద్రణమందుటయే దీనిప్రాశస్త్యమును దెలుపుచున్నది. మొదటిభాగమున పార్వతీశము అను యువకుడు యింగ్లండువెళ్ల ప్రయత్నించి నరసాపురముదగ్గరనుండు తనగ్రామమునుండి రైలుజేరి ఇంగ్లాండుచేరువరకు, మధ్యలో అనుభవములేనందున పడినచిక్కులన్నిటిని తెలిపెడికథ గలదు. కథావిధానమందసంగతమైన కొన్నివిషయములున్నను రచనావిధానము దానికి మెఱుగుబెట్టినది. ఆదియు వాడుకభాషలో వ్రాయుటచేత మరింతరాణించినది. పుస్తకమంతయు మధురహాస్యముతో నిండి పుస్తక మారంభించినమొదలు ముగించువఱకు క్రిందబెట్టనీయని యాకర్షింగలిగించుచున్నది. నూతనముగా చెన్నపట్టణము వచ్చువారును యితరచోటులకును సముద్రముమీద ప్రయాణముచేయువారును తెలిసికొనదగిన విషయములిందు చాలగలవు. వెల రు. 1-0-0 భవానీభాండారమున మదరాసు, లేక పిఠాపురమున దొరుకును.

*     *     *     *

## దక్కను వైశ్యపత్రిక

ఇది నెల్లూరునుండి వెలువడు పక్షపత్రిక. సంపాదకులు జవ్వాది సుబ్బారాయుసుస్త సిద్ధాంతిగారు. సంవత్సరచందా రు 3-0-0 లు.

వైశ్యకులాభివృద్ధికై వెలువడువైశ్యపత్రికలలో నిదియొకటి. నిజాంరాష్ట్రివాసుల కందుబాటులో నుండగలందులకై సికిందారాబాదులో నొకబ్రాంచికార్యాలయము స్థాపింపబడెను. ఈపత్రికయందు కథలు వివిధవార్తలు, పెక్కువ్యాసములుగలవు.

## నవ్యజ్యోతి

హిందూపురమునుండి కె. బి. కృష్ణమూర్తి బి.ఎ. గారి సంపాదకత్వమున వెలువడుచున్న సచిత్రమాసపత్రిక. విజ్ఞానప్రపంచమున సర్వవిషయములను ప్రకటింప నుద్దేశించు నీపత్రిక మొదటిసంచికలో వివిధవిషయములకు సంబంధించిన పెక్కుపద్యగద్యవ్యాసములు గలవు. దీనిని గమనించి పత్రిక నీవిధముగ వెలువరించుటకు సంపాదకులెక్కువ శ్రద్ధజూపినట్లు గనపడుచున్నది. ఈపత్రిక పద్యరచన కెక్కువ యాదరించునట్లున్నది. స్త్రీల విషయములనుగూర్చి ప్రథమసంచికయందే వ్యాసములుగూర్చుట ముదావహము. రాయలసీమనుండి వెలువడు నీమాసపత్రిక యభివృద్ధిపొందుగాకయని కోరుచున్నాము.

సాలుచందా రు. 3-0-0     విడిప్రతి 0-3-0 అణాలు.

## రెడ్డిప్రభ

ఇదియొక సచిత్రమాసపత్రిక. సంపాదకుడు చేబ్రోలు గోవిందరెడ్డిగారు. సాలుచందా రు. 2-0-0 దొరుకుచోటు: రెడ్డిప్రభ కార్యాలయము కొమ్మరు,పశ్చిమగోదావరిజిల్లా.




## కాంగ్రెసు తీర్మానములు:

అది మార్చిపదునెనిమిదవ తేది. ఢిల్లీ అఖిలభారత కాంగ్రెసుకమిటీ "నూతన రాజ్యాంగవిధానము ననుసరించి మంత్రివర్గము తమకార్యకలాపమును కొనసాగించునంతవఱకు ఆయారాష్ట్రముల గవర్నరుల కివ్వబడిన ప్రత్యేకాధికారముల నుపయోగింపమని వాగ్దానముచేయనిచో కాంగ్రెసు మంత్రిపదవులు నంగీకరింపదు" అను నిర్ణయమునకు వచ్చినది. దానితో ప్రభుత్వము వారికి పచ్చివెలగకాయ తిన్నట్లయినది. మంత్రిపదవి వ్యామోహితులకు కాళ్లు చల్లబడినవి. ఏప్రెలు మొదలుతేది సంస్కరణము లమలులోనికివచ్చినవి. అనుకున్నటులనేజరిగినది. పూచీలు నిరాకరింపబడినవి. పదవీస్వీకరణములేకనే తమ యిష్టానుసారము నిర్మింపబడనిచట్టమును నెదుర్కొనవచ్చుననెడి యాశ కాంగ్రెసునకు బలపడినది. ప్రజాప్రతినిధులై యధికసంఖ్యాకులై యున్న కాంగ్రెసువారా యారాష్ట్రములందు మంత్రిపదవుల నిరాకరించినందున యేపక్షమునకుజెందని రాష్ట్రీయశాసనసభలందు పలుకుబడి యెంతమాత్రమునులేక శాసనసభాసమావేశములకే జంకుచుండెడి 'కా-హై'లందరు మంత్రిపదవుల నధిష్టించి ప్రభుత్వము 'తిన్నగా సాగించుటకు'తోడ్పడుచుండిరి. దీనితో రాజకీయములందు సంచలనమేర్పడినది. తరువాత కాంగ్రెసువారి యాశయముల వెల్లడించుచు మహాత్మగాంధిగారును, బ్రిటిషువారియాశయముల వెల్లడించుచు లార్డు జెట్లండు, బట్లరుప్రముఖులు ప్రకటనలను గావించిరి.

ఇది ఏప్రెలు 28 వ తేది. నలువదిరోజుల తరువాతవిషయము. ఈనాడు మరల కాంగ్రెసువిషయ నిర్ణయసమావేశము అలహాబాదునందు జరిగినది. కాంగ్రెసు దృష్టి మారలేదు. అనగా భారతీయు లందరు తాము ముందు గావించుకొనియున్న తీర్మానమునకుగట్టుపడియున్న వారన్నమాట. సమావేశ మీవిధముగ తీర్మానించినది. "బ్రిటిషు గవర్నమెంటు యుద్దేశ్యమునుగూర్చి లార్డు జెట్లండు, బట్లరుగారలు గావించిన ప్రకటనలు కాంగ్రెసువారి కోరికలనెరవేర్చ నెంతమాత్రము చాలియుండలేదు, సరికదా కాంగ్రెసువారి యాశయముల తల్లక్రిందుల వ్యాఖ్యగావించి దురభిప్రాయములను గల్గించున్నవి."

"యీ ప్రకటనల వైఖరిజూడ కాంగ్రెసువారి కమర్యాదగలిగించు రీతిగనున్నది. ఇంతకుముందు గావించిన తీర్మాన

మునకే కాంగ్రెసువారు బద్ధులైయున్నారు. హామీనిచ్చుట తగినదే. తగిన పూచీలేక మంత్రాంగమునడపుట కష్టమే."

ఈ తీర్మానము మంత్రిపదవు లేవిధముగనైన పొందవలయుననెడి నాయకుల యాశను దూరముచేయుచున్నది. ప్రభుత్వము వారు రాజ్యాంగవిధానమును తమ కిష్టము వచ్చినవారి సాయముతో కొనసాగింపవీలు గలిగినది.

ప్రభుత్వమువారు కాంగ్రెసుకోర్కెల ననుసరించి హామీయిచ్చుటకు తప్పక నిరాకరింతురని యెఱిగియే కాంగ్రెసువారు మరల నీ తీర్మానము గావించియుండక యేవిధముగనైన ప్రభుత్వమువారికిని తమకును సమాధానముకుదిరి మంత్రిపదవులు చేజిక్కించుకొనవలయుననెడి యుద్దేశ్యముతో జేసియుండురనుటకు వీలు లేదు. పదవీవ్యామోహమును తుదముట్ట విరమించుకొని భారతీయుల యసమ్మతితో నిర్మింపబడిన యీరాజ్యాంగ విధానమునకు విశ్రాంతిగలిగింప పాటుబడవలయును. పైసమావేశమునందు కూడ పదవీవ్యామోహితులు కొందరు సమాధానమున గలుగుటకు సులభముగ నుండురీతి తీర్మానమును సవరింపదలంచిరని తెలియుచున్నది. ఈవ్యామోహ మింకను వారిని వీడకుండుట శోచనీయమే.

* * *

హరిజనసమస్య — తిరువాంకూరు
కొచ్చిను రాజ్యములు:

తిరువాంకూరు కొచ్చినురాజ్యములందలి ప్రజల యాచారవ్యవహారములం దెట్టి భేదమును గన్పట్టదు. ఇటీవల నాదేశముల పరిపాలించు రాజులబట్టి నవియించుక మార్పులు జెందుట కారంభించినవి. తిరువాంకూరు మహారాజు యువకుడు. ప్రాచ్యపాశ్చాత్య నాగరికతలందలి మంచిచెడుగుల నెఱిగియున్న మహారాణీగారిచే నుదారాశయముల నుగ్గుబాలతో బెట్టబడినవాడు. ఉన్నతవిద్యబొంది పెక్కుదేశములందు సంచారముగావించి ప్రజానురంజకముగా రాజ్యము చేయవలయునను తలంపులను నానాటికి బలపరచుకొనువాడు. రాజ్యమునకువచ్చిన యచిరకాలముననే అస్పృశ్యులుగా నెంచబడు హరిజనులందరు తనరాజ్యమున దేవాలయములు ప్రవేశింపవచ్చునని యుత్తరువుగావించి, సనాతనధర్మముపేరట జరుగు నన్యాయములనడ్డగించి యందరిమన్ననలకు పాత్రులైరి. ఇక కొచ్చినురాజుగారన్ననో సనాతనధర్మపరులు. ప్రజానురంజకముగా రాజ్యమునేలు విషయమై శ్రద్ధవహించినను, సనాతనధర్మమున కెంతమాత్రము నిరోధము గలిగింపకూడదనెడు పట్టుదల గలవారు.

తిరువాంకూరు మహారాజుగారికి కొచ్చినునందున్న కుడలుమాణిక్యం మొదలగు దేవాలయములకు అర్చకుల నియమించు అధికారము గలదు. ఇదివఱకు తిరువాంకూరునందు దేవాలయములలోనికి హరిజనుల రానిచ్చుచున్నందున అచటిపూజారులు తన రాజ్యమందు దేవాలయముల లోనికి ప్రాయశ్చిత్త శుద్ధికర్మల చేయించుకొన్నంతవఱకు రాకూడదనియు పూజాపున

స్కారములు చేయగూడదనియు, వారిదివఱకు పై దేవాలయమందు పూజార్చనలు జరిపి నందులకు దేవాలయమునుకూడ శుద్ధిపరుప వలయుననియు, సంతవఱకు ఆ దేవాలయమును తాము దర్శించుట మానుచున్నామనియు, కొచ్చిను మహారాజుగారు ఉత్తరవుల గావించిరి. ఆరీతిగా అర్చకుల కా దేవాలయములోనికి నిరోధము, దేవాలయమునకు సంప్రోక్షణయు జరిగినది.

తిరువాంకూరు మహారాజుగారు కొచ్చిను రాజ్యమునం దర్చకులకు దేవాలయములకు ఏటేట రెండులక్షల రూపాయలను వెచ్చించుచున్నారు. వారీ కొచ్చినుమహారాజుగారి యుత్తరువులను విన్నపిదప తనరాజ్యమున ప్రకటింపబడినచట్టము కొచ్చినురాజ్యమున నున్న దేవాలయములకు వర్తింపనిచో తానా రెండులక్షల రూపాయల నిచ్చుట మానివైతుననియు ప్రకటించెను. అందుచే నిపుడు సంధిగ్ధావస్థ యేర్పడినది.

దేవాలయములు కొచ్చినందున్నను వానికి అర్చకుల నియమించు నధికారము తిరువాంకూరు రాజునకే యున్నందున యీతగవు ఇండియా దొరతనమువారే తీర్పతగినదని కొచ్చిను రెసిడెంటుగారు ప్రకటించియున్నారు. ఎవరెటుల తీర్మానించినను, రాజ్యాధికారులగు తామే యుక్తమగు రీతి దానిని యోచించి పరిష్కరించుట బాగు. ధనలాభము నటుండనిచ్చి దేశమునకు సంఘమునకుగలుగు నష్టమునుగుర్తించి శతాబ్దములుగా నణగద్రొక్కబడిన హరిజనసోదరుల నితరులరీతి యాదరింప బూనుకొనుట యుక్తము. తనతోడి సంస్థానాధీశుడు కాలమునందలి మార్పులను గమనించి సర్వసమ్మతముగా వర్తింపదలంచినచో తానుమాత్ర మా పద్ధతిని నిరాకరించు టెందులకు? తమ జీవితకాలమంతయు తుచ తప్పక యనుష్టించిన సనాతన ధర్మము వారికి దేవునిదృష్టిలో నందరొక్కటే యనియు, హరిజనులు దేవాలయముల ప్రవేశించుమాత్రమున కలుషితములగు దేవతలు వట్టి బూటకములనియు, అగ్రజన్మలకుమాత్రమాశ్రయమిచ్చి హరిజనుల నవతలకుద్రోలు ఆదేవాలయములలోని విగ్రహములు స్వార్థపరత్వమునకు నిలయములనియు, నేర్పియుండదని యెవరైన నమ్మగలరా! ఎటులైనను సనాతనధర్మముతో మానవధర్మమును చేర్చుకున్న నది రాణింపదు.

* * *

**'త్రాగుడును' స్త్రీలు రూపు మాపగలరు.**

దేశదౌర్భాగ్యమున కమితముగా తోడ్పడుచున్నవానిలో త్రాగు డొకటి. పొట్టకూటికై ఉదయాస్తమానము కాయకష్టముజేసి విశ్రాంతినిమిత్తమై బీదలు త్రాగుడు నలవాటు జేసికొన్నారు. వైభవోపేతముగా నసించుటకు జీవితము నానందయుతముగా గడపుటకని భాగ్యవంతులు వాడుక జేయుచున్నారు. గృహచ్ఛిద్రముల చేతనో మరే కలతలవలననో మనోశాంతి లేక దానినుండి తప్పించుకొనగోరి కొంత

మంది త్రాగుట కలవాటు పడుచున్నారు. ఏవిధమున నిది యలవడినను ఫలితమొక్కటియే. ఈపిశాచ మావహించెనేని ఇల్లు గుల్లయగును; ఎంత ధనమైనను 'కరిమ్రింగిన వెలగపండే'; ఎన్ని దుర్మార్గములైన నలవడును; లేని రుగ్మతలు శరీరమును పాడుచేయును. త్రాగుడువాడుకగలవారు బీదవారైనచో వారి దుర్భరస్థితి వర్ణనాతీతము.

త్రాగుబోతులు తాము పడు బాధలకంటె యింటనున్న స్త్రీని పెట్టుబాధలు దారుణములై యుండును. ఈవిషయమై యీ దారుణబాధలనుండి తప్పింప దేశీయ నేత లేమైన చేయకూడదాయని యొక సోదరి మహాత్ముని కిటీవల వ్రాసినది. దానికి ప్రత్యుత్తరమిచ్చుచు హరిజనపత్రికయందు మహాత్ముడు భారతస్త్రీలకొక దివ్య సందేశమిచ్చియున్నాడు. అసహాయోద్యమమున వేలకొలది స్త్రీలు త్రాగుడు నిర్మూలింప కంకణము గట్టి, దేశమునందంతటను కల్లు సారాయి దుకాణములముందు పికెటింగు జేసి త్రాగవచ్చిన వారినందరిని వేవిధముల బతిమాలి వారిచే పడరానిమాటలనుపడి, కొన్ని వేళల దెబ్బలనుకూడ దిని స్థిరముగానిల్చి త్రాగుడును చాలవఱకు నిలిపిరి. ఆ ఉద్యమమంతరించిన తరువాత నది మరల యథాప్రకారమయ్యెను. ప్రభుత్వమువారి కిందులో నెక్కువ లాభము వచ్చుచున్నందుల దీని నిర్మూలమునకై ప్రయత్నింపరు. అంతమాత్రమున నష్టమేమియు లేదు.

స్త్రీలసహాయోద్యమమందు జూపిన పట్టుదల నేర్పు నిపుడు వలసినచోటులజూపి తమపతులను చక్కదిద్దుకొననగును. పురుషులను బాగుచేయుటకు స్త్రీలకెంత పలుకుబడి సామర్థ్యము గలదో వారెఱుగరు. సతులలో పెక్కుమంది భర్తల చేతలందు జోక్యము కల్పించుకొనుట హక్కు లేదనుకొందురు. భర్తలు వారి శీలసంరక్షకులుగా నెట్లైరో, స్త్రీలుకూడ వారిభర్తల శీల సంరక్షకులుగ నుండవలసిన విషయమును వారు దలంపరు. స్త్రీలందరు తమ శక్తి సామర్థ్యముల మేలుకొల్పి తమ బాధ్యతల గుర్తించుట త్రాగుడు నివారించుటకు మొదటిమెట్టు. తరువాత స్త్రీలు త్రాగుడుకు గల కారణములను శ్రద్ధగాపరిశీలింపనగును. మంచిమాటలచేతనే యీ దురభ్యాసమును పోగొట్ట దలంచుకొన్న నది సరియగు ఫలితముల నివ్వదు. త్రాగుడు నొకరోగముగా నెంచి దానికి క్రమక్రమముగా విడువక చికిత్స చేయుచుండవలెను.

మహాత్ముని పై యుద్దేశ్యములతో ప్రతి సోదరియు నేకీభవింపగలదు. వారు స్థితిగతులనెఱిగి యుచితరీతి మెలగుటకు నేర్చుకొన్నచో నితరులసాయము లేకుండగనే యీపిశాచమును పారద్రోలగలరు.

* * *

హింసావిద్యార్థినీ సమాజము—కాకినాడ.

'హిందూసుందరి'యాజమాన్యమున నిర్వహింపబడుచుండు పాఠశాలయొక్కయు సమాజముయొక్కయు వార్షికపు నివేదికను

కృతజ్ఞతతో నందికొంటిమి. శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారిచే ముప్పదిరెండు సంవత్సరములక్రింద స్థాపింపబడిన పత్రికయొక్క కృషిచేతనే 1910వ సంవత్సరమున హిందూవిద్యార్థినీ సమాజమును, 1923వ సంవత్సరమున శ్రీ మహిళా విద్యాలయము ను స్థాపింపబడి నేటివఱకు అవిచ్ఛిన్నముగా స్త్రీలచేతనే నిర్వహింపబడుచు వచ్చినవి. ఈమూటికిని ఉదారులందరును తగినకీర్తి సాయపడి యీసంస్థలను నిరంతరాయము కొనసాగింప బాధ్యత వహింపవలయునని ప్రార్థించుచున్నాము. ఇవి హిందూసుందరి ప్రతిభ కాదర్శమై వెలయుగాత.

* * *

దసరాసంచిక.

రాబోవు అక్టోబరు మాసారంభమునందు యథాప్రకారముగ దసరా గృహలక్ష్మి సంచిక సర్వాంగసుందరముగా వెలువడును. ఈసంచికయందు స్త్రీరచనలే ప్రకటింపబడును గాన సోదరీమణులెల్లరు రసవంతమగు తమ పద్యగద్యరచనలను ఆగస్టు నెలాంతములోపల నేపంపి సంచిక చక్కగ వెలువడుటకు తోడ్పడుదురని ప్రార్థించుచున్నాము.

వ్యాసములు వివిధవిషయములకు సంబంధించి యుండనగును. సాధ్యమైనంతవఱకు క్లుప్తముగ (గృహలక్ష్మిపై జన 4 పుటలకు మించక) నుండవలయును. వ్యాసమును బంపు ప్రతిసోదరీమణియు తమ ఛాయా చిత్రములగూడ పంపవలయునని మనవి.

నిరుద్యోగులగు స్త్రీలు

స్త్రీలోకమునకు సాధ్యమైనన్ని విధములతోడ్పడి వారి నభివృద్ధికి దీసికొనివచ్చుటయే గృహలక్ష్మి యుద్దేశ్యమై యుండుటవలన నిరుద్యోగులకుకూడ నిపుడు ప్రత్యేక సౌకర్యములు చేకూర్పదలంచి యీప్రకటనజేయుచున్నాము. విద్యావంతులయ్యు ఉద్యోగము చేయవలసిన యవసరముండియు, ఇష్టముగల్గియు నుద్యోగముల వెదకుకొనుట కశక్తులైన కొంతమంది సోదరీమణు లుండవచ్చును. వారుద్యోగములకొరకు పత్రికలందు ప్రకటింపలేని స్థితియందుకూడ నుండవచ్చును. అట్టివారు తమయోగ్యతయు, కావలసినయుద్యోగములను, కనీసపుజీతమును ఇతరవివరములను మాకార్యాలయమునకు బంపుకొనవచ్చును. వారి స్థితిగతులను గమనించి కావలసినయుద్యోగములకు ఉచితముగా మూడుమాసములు ప్రకటింతుము. ప్రకటింప నిచ్ఛగించువారు తమ పూర్తిచిరునామా ప్రకటింప సమ్మతింపవలయును. ఉత్తరప్రత్యుత్తరములు వారే నేరుగా జరుపుకొనగలరు.

సంపాదకు లుచితములని తీర్మానించినవి మాత్రము ప్రకటింపబడునుగాన నావిషయమై యుత్తరప్రత్యుత్తరములు పెంచకుండుట లెస్స. నిరుద్యోగులై నిస్సహాయులై యుండు సోదరీమణులీ యవకాశమును నుపయోగించుకొందురు గాక.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## ఈశ్వర సం॥ర చైత్ర వైశాఖములు

1937 సం॥ మే నెల

| | |
|---|---|
| 1 | ష॥ శ పూర్ణి పూర్వాషా రా 11-21 వ ఉ7-54 మొ9-37 భో6-28 |
| 2 | ప॥ ఆ ఉ6-17 ఉషారా 12-43 వ ఉ7-48 మొ9-30కు వ తె4-44 మొ భో 6-24 |
| 3 | ప॥ సో ఉ6-49 శ్రిరా 1-29 శేవ ఉ6-23కువ తె5-29 మొ భో6-20 క ర్తరి మొదలు |
| 4 | అ॥ మం ఉ6-48 ధ రా1-49 శేవ ఉ7-5కు భో6-17 |
| 5 | న॥ బు ఉ6-21 ద తె5-27 శతరా 1-38 వఉ8-58 మొ10-33కు భో6-14 |
| 6 | ఏ॥ గు తె4-4 పూభా రా 1-4 వఉ7-42 మొ9-26కు భో6-10 |
| 7 | ద్వా॥ శు తె2-16 ఉభా రా 12-5 వఉ10-14 మొ11-46కు భో6-6 |
| 8 | త్ర॥ శ రా12-13 రేరా 10-50వ ప11-26 మొ12-57కు భో6-2 |
| 9 | చతు॥ ఆ రా9-57 అశ్వ రా9-21వ సా5-36 మొ7-6కు భో5-58 |
| 10 | అమా॥ ● సో రా 7-34 భరరా 7-45 వఉ6-18 మొ7-48కు భో5-54 |
| 11 | శు॥ పా మం సా5-8 కృసా 6-1: వఉ6-55 మొ8-4కు [భో5-46 |
| 12 | వి॥ బు ప2-41 రోసా 4-26 వఉ3-59 మొ10-28కు వరా9-38 మొ11-8కు తిథిద్వయం |
| 13 | త॥ గు ప12-20మృ ప2-53వ రా10-28 మొ12-19కు అక్షయతృతీయ చతుర్థితిథి భో5-42 |
| 14 | చ॥ శు ఉ10-10 ఆర్ద్ర ప1-31 వరా12-57 మొ2-29కు భో5-38 |
| 15 | పం॥ శ ఉ8-12 పునప12-24 వరా8-11 మొ9-44కు |
| 16 | ష॥ ఆ ఉ 6-39 సప్తమి తె5-20 పుష్యఉ11-40 వరా12-18 మొ1-52కు భో7-27 |
| 17 | అ॥ సో తె4-31 ఆశ్లేప11-19 వరా11-22 మొ12-58కు భో7-24 |
| 18 | న॥ మం తె4-20 మఖప11-24 వరా7-35 మొ9-13 భో7-20 |
| 19 | ద॥ బు తె4-31 పుబ్బ ప12-19 వరా7-29 మొ9-9 భో7-16 |
| 20 | ఏ॥ గు తె5-18 ఉత్తర ప12-49 వరా9-57 మొ11-39 భో7-12 |
| 21 | ద్వా॥ శు పూర్తిహా ప2-36 వరా11-16 మొ1-0కు భో7-8 |
| 2 | ద్వా॥ శ ఉ6-37 చిత్తసా 4-36 వరా10-42 మొ12-27కు భో7-4 |
| 23 | త్ర॥ ఆ ఉ:-13స్వా రా8-32 వరా1-8 మొ2-54కు నృ. జయంతి భో 8-0 |
| 24 | చతు॥ సో ఉ10-4 విశారా 9-28 వరా1-56 మొ3-42కు వైష్ణవనృ॥ జయంతి భో6-56 |
| 25 | పూ॥ మం ప12-4 అనూరా12-8 వర్జ్యంలేదు. భో6-52 ప్రతిప త్తిథి [4-58కు భో6-44 |
| 26 | బ॥ పా బు ప2-6 జ్యేష్ఠ రా2-40 వఉ6-19 మొ8-5కు భో6-48 శూన్యతిధి వరా3-13 మొ |
| 27 | ౘ॥ గు ప3-53మూ తె4-58వ ప11-26 మొ1-11కువ |
| 28 | త॥ శు సా5-19 పూషా పూర్తి వ సా3-18 మొ5-2కు క ర్తరిత్యాగః భో6-40 |
| 29 | చ॥ శ సా6-22 పూషా ఉ6-43 వ సా3-12 మొ4-54కు భో6-36 |
| 30 | పం॥ ఆ రా7-5 ఉషా ఉ8-10 వప12-19 మొ1-59కు భో6-32 |
| 31 | ష॥ సో రా6-54 శ్ర ఉ9-4వ ప1-9 మొ2-47కు భో6-28 |

# ప్రసవకాలమును తెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొన వలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | |
|---|---|---|
| జనవరి | 1 2 3 4 5 6 7 89 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | జనవరి |
| అక్టోబరు | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 1 2 3 4 5 6 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 | ఫిబ్రవరి |
| నవంబరు | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 1 2 3 4 5 | డిసంబరు |
| మార్చి | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | మార్చి |
| డిసంబరు | 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 33 31 1 2 3 4 5 | జనవరి |
| ఏప్రిల్ | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 | ఏప్రిలు |
| జనవరి | 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 1 2 3 4 | ఫిబ్రవరి |
| మే | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | మే |
| ఫిబ్రవరి | 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 1 2 3 4 5 6 7 | మార్చి |
| జూన్ | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 | జూన్ |
| మార్చి | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 1 2 3 4 5 6 | ఏప్రిలు |
| జూలై | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | జూలై |
| ఏప్రిల్ | 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 23 29 30 1 2 3 4 5 6 7 | మే |
| ఆగష్టు | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | ఆగష్టు |
| మే | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 1 2 3 4 5 6 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 | సెప్టెంబరు |
| జూన్ | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 1 2 3 4 5 6 7 | జూలై |
| అక్టోబరు | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | అక్టోబరు |
| జూలై | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 1 2 3 4 5 6 7 | ఆగష్టు |
| నవంబరు | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 | నవంబరు |
| ఆగష్టు | 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 1 2 3 4 5 6 | సెప్టెంబరు |
| డిసంబరు | 1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 31 | డిసంబరు |
| సెప్టెంబరు | 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24 25 26 27 28 29 30 1 2 3 4 5 7 6 | అక్టోబరు |

# బెజవాడ, సరస్వతీబుక్ డిపోవారి స్వంత ప్రచురణములు

## స్టేజి నాటకములు

| పేరు | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| సతీసక్కుబాయి, | సో|| రా|| | 0 | 12 | 0 |
| సతీఅనసూయ | డిటో | 1 | 0 | 0 |
| మహాభక్తవిజయము | డిటో | 1 | 0 | 0 |
| భీష్మబ్రహ్మచారి | డిటో | 1 | 0 | 0 |
| ధరణీకోట (రత్నప్రతాపము) | | 1 | 0 | 0 |
| రంగూన్‌రాడీ (పతిభక్తి) | | 1 | 0 | 0 |
| భోజకాళిదాసు | డిటో | 1 | 0 | 0 |
| కాలకేతనము (ట్రాజిడీ) | | 1 | 0 | 0 |
| పార్వతీగర్వభంగము,అను గంగావతరణము | | 1 | 0 | 0 |
| ప్రతాపరుద్రీయము | | 1 | 0 | 0 |
| తాజ్ మహల్ (జహానారా) | | 1 | 0 | 0 |
| శశిరేఖాపరిణయము | | 0 | 12 | 0 |
| శ్రీకృష్ణతులాభారము, | ము|| సు|| | 1 | 0 | 0 |
| చంద్రగుప్త (మౌర్యాభ్యుదయం) | | 1 | 0 | 0 |
| రాధాకృష్ణ, | పా|| ల|| | 0 | 12 | 0 |
| విప్రనారాయణ | డిటో | 1 | 0 | 0 |
| పాదుకాపట్టాభిషేకము | | 1 | 4 | 0 |
| శ్రీకృష్ణలీల | మ|| అ|| | 1 | 0 | 0 |
| బలిబంధనము | చం|| కే|| | 1 | 0 | 0 |
| ద్రౌపదీవస్త్రాపహరణము | మ|| అ|| | 1 | 0 | 0 |
| పత్నీప్రతాప్ అనసూయ | సో|| అ|| | 1 | 0 | 0 |
| బుద్ధిమతీవిలాసము | బ|| ల|| | 1 | 0 | 0 |
| రామదాసు. బళ్లారి | డి|| గో|| | 1 | 0 | 0 |

| పేరు | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| చింతామణి | కా|| నా|| | 1 | 0 | 0 |
| మధుసేవ | డిటో | 1 | 0 | 0 |
| చండిక | ము|| చె|| | 1 | 0 | 0 |
| సావిత్రి | శ్రీ|| గు|| | 1 | 0 | 0 |
| బొబ్బిలియుద్ధము | శ్రీ|| కృ | 1 | 0 | 0 |
| కృష్ణలీల బళ్లారి | కొ|| సు|| | 1 | 4 | 0 |
| లవకుశ | డిటో | 1 | 4 | 0 |
| సంపూర్ణమహాభారతము | | 1 | 0 | 0 |
| రసపుత్రవిజయము | ఇ|| య|| | 1 | 0 | 0 |
| రాణాప్రతాప్‌సింగ్, | డిటో | 1 | 0 | 0 |
| చంద్రగుప్త | నం|| శి|| | 1 | 0 | 0 |
| రాణాప్రతాపసింహ, | జం|| శి|| | 1 | 0 | 0 |
| జయంతజయపాలము | ఆ|| స|| | 0 | 12 | 0 |
| శ్రీరామాంజనేయము | పి|| బి|| | 1 | 0 | 0 |
| ప్రసన్నయాదవము | చి|| ల|| | 0 | 8 | 0 |
| శ్రీకృష్ణతులాభారంసాంగ్స్ | చం|| కే|| | 0 | 12 | 0 |
| రాధాకృష్ణసాంగ్స్ | డిటో | 0 | 12 | 0 |
| తెనాలిరామకృష్ణ | చి|| సో|| | 0 | 8 | 0 |
| రామకబీర్ బళ్లారి | డి|| గో|| | 1 | 4 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము | బ|| ల|| | 1 | 0 | 0 |
| సంపూర్ణరామాయణము | బ|| కో|| | 1 | 0 | 0 |
| భక్తకబీర్, | కొ|| స|| | 0 | 8 | 0 |
| వృద్ధవివాహము | గో|| వె|| | 0 | 8 | 0 |
| ఆలీబాబా 40 దొంగలు | సో|| రా|| | 1 | 0 | 0 |

కోరినవారికి మాకంపెనీ 120 పేజీల కేటలాగు ఉచితముగాపంపబడును.

వలయువారు :

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు — సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.